[ ఒకవైపున ప్రేమ – మరోవైపున సైనిక క్రమ
శిక్షణ – యింకొకవైపున కర్తవ్య నిర్వహణ
ఈ సుడిగుండంలో చిక్కుకుని నిలవదొక్కు-
కున్న చీనా ఎర్రసైనికుని ప్రణయగాధ.

రచయిత ఎర్రసైన్యంలో సంస్కృతీ ప్రబోధకుడు...
అనుభవం ఆధారంగా వ్రాసిన ఈ ప్రణయగాధ
అతని ప్రథమరచనే అయినా సైనికజీవితాన్ని
చిత్రించిన రచయితలలో అగ్రగణ్యునిగా పేరు
తెచ్చింది. ]

Ix

# సుడిగుండం

[IT HAPPEND AT WILLOW CASTLE]




మూలం:

షీ-మెన్

అనువాదం:

యస్. టి. ఆర్.

*A*

*Sahini Publication*

VI

సా హి ణి

ప్రచురణ : 4

మార్చి 1952

సాహిణీ ప్రెస్
గవర్నరుపేట :: విజయవాడ



# I

నాల్గవస్క్వాడ్ లీడరు, తన స్క్వాడ్‌లోనివారి పరిస్థితిని గూర్చి రిపోర్టు పూర్తిచేశాడు. ఏదో వ్యథచెందుతూన్నట్లు ఒకక్షణం ఆగాడు.

“కమిసార్” అంటూ తొందరగా అందుకున్నాడు. “నా అసిస్టెంటు తప్పు అభిప్రాయాలకు లోనవుతున్నాడనుకుంటాను. మేమున్నయిల్లుందిచూచారూ, ఆ అమ్మాయితో.........ఆ అమ్మాయితో అతను చిక్కుల్లో పడతాడని భయపడుతున్నాను.”

“ఏమిటీ! కుర్రవెధవా!” నేను ఆశ్చర్యపోయాను... ఎందుకంటే నేనింకా అతన్ని చిన్నపిల్లవానిగానే చూస్తున్నా.

తన సవతితల్లి బాధలు పడలేక 1941 లో అతను పారిపోయివచ్చాడు. సరిగా అప్పుడే నన్ను కంపెనీకి కమిసార్‌గా వేశారు. అప్పటికి అతను పదిహేనువళ్ళ పసివాడు. కేవల్రీ ఉపయోగించే ఏకబారు తుపాకి వీపుకు అడ్డంగా తగిలించుకొని, గుండ్రని మొఖంతో వొంటినిండా దుమ్ముకొట్టుకొని అతను...లీజిన్...ఒకరోజున వచ్చాడు.

కాంప్రేడ్సంతా అతన్ని పసివాడని వేళాకోళం పట్టించే వారు. వాళ్ళలా చేసినకొద్దీ తనూ 'పెద్ద' వాడే నని రుజువు చేసుకొనేందుకు ప్రయత్నించేవాడు లీజిన్. నిజంగా అంతపని కూడా చేశాడు. అతని తుపాకి గురికి అనేకమంది తొత్తులు లొంగిపోయి ఆయుధాలప్పగించేశారు. ముప్పయి మీటర్ల దూరానికైనా చేతిబాంబు విసిరాడంటే జపానురాక్షసుల తలలు తెగి గుట్టలుగా పడాల్సిందే.

ఇప్పుడు లీజిన్ నా అంత పొడగరి అనీ, అతని మాట పొందికైందనీ, నేనింతవరకు గుర్తించనేలేదు. లీజిన్ విషయములో స్క్వాడ్ లీడరు చెప్పిన సమస్య లాంటిది అసలు రావచ్చుననే ఊహకూడా నాకులేదు. అప్పుడే గుర్తించాను. ఇది 1944 సంవత్సరం ఆతనికిప్పుడు పదునెనిమిది ఏళ్ళు. ఇక ఆశ్చర్యపడాల్సింది ఏముంది.

ఈ విషయాలన్నీ నా బుర్రలో గిర్రున తిరిగాయి. "ముందు కురకండి" అని ఆజ్ఞాపించటానికి పట్టేకాలం కూడా ఈ విషయాలన్నీ గుర్తుకు రావటానికి పట్టలేదు.

"మేము యింట్లోకి వెళ్ళినప్పుడు ఆ అమ్మాయి అక్కడ లేదు." అంటూ స్క్వాడ్ లీడరు అందుకున్నాడు. "కొద్దిరోజులయినతర్వాత వచ్చింది. బహుశా ఆమె తండ్రి ఆమెని ఏ చుట్టాలింట్లోనో మానుంచి తలదాచుకోమని పంపి వుంటాడను కొంటాను. తర్వాత మా ప్రవర్తన చూసి ఫరవాలేదని ఇంటికి తీసుకువచ్చి ఉంటాడు. ఆ అమ్మాయి వయసూ 'సరిగా లీజిన్ వయిసే."

అప్పుడు నాకు జ్ఞప్తికొచ్చింది, నాల్గవ స్క్వాడ్ ఉన్న ఇంటిని గూర్చి. ఒక దానికొక ఎదురుగా ఉత్తర దక్షిణాలుగా రెండు చిన్న పూరికొంపలున్నాయి. ఆ ఆవరణలో రెంటికీ నాలగంగల దూరంకూడా లేదు. నా అజమాయిషీ క్రిందే ఆ యిట్లో నాల్గో స్క్వాడ్ దిగటం జరిగింది. అప్పుడే నేనూ చూశాను ఆ అమ్మాయిని. అందగత్తెనని అంగీకరించక తప్పదు. ఎంత కమిసార్ నైనా చక్కటి చుక్క కనిపిస్తే కనురెప్పలు వాలిపోతాయా? ఖర్మాకాలి. అప్పుడే అనుకున్నట్లు జ్ఞప్తి... నాల్గో స్క్వాడ్‌లోని వారెవ్వరూ ఆమె విషయం పట్టించుకోరని అనుకున్నట్లు... కాని అప్పుడు కూడా లీజిన్ ఇంత గందరగోళం చేయగలడని నేను భావించలా. అసలు ఇలాంటి విషయాలు మా కంపెనీలో జరగటమే చాలా అరుదు. అందుకనే ఆ పిల్ల విషయం పెద్దగా ఆలోచించాలనీ, పట్టించుకోవాలనీ నేనప్పుడు అనుకోలేదు. కాని ఇప్పుడో అది ఒక పెద్ద విషమ సమస్య అయి కూర్చుంది. కంపెనీ కమిసార్‌గా దానిని సరిదిద్ద వలసిన బాధ్యత నాపైన ఉంది.

"వ్యవహారం ముదిరి చిక్కుల్లో పడలేదుగదా" అని అడిగాను.

"అబ్బే ... ఇంకా లేదు ... కనిపిస్తున్నంతవరకు... ముందుముందు ఏం జరుగుతుందో పందెం వేయలేను కాని... ముందు ఈ విషయాన్ని నేనంతగా పట్టించుకోలేదు కాని ఈ మధ్య లీజిన్ యాంగో డాన్సకులా ముస్తాబవుతున్నాడు."

ఈ విషయం ఆలోచనలోకివస్తే ఇంకోటి నాకు జ్ఞాపక మొచ్చింది.

రెండురోజులక్రితమే లీజినకు, ఇంకా ఇతరులకు పత్రికా పఠనాన్ని గూర్చి చెబుతోంటే, మాంచి సెంటు గుమాయింపు వచ్చింది. దాన్ని గూర్చి విచారిద్దామనుకునే లోపలే ప్రధాన కార్యాలయంనుంచి పిలుపువచ్చి నేను వెళ్ళవలసి వచ్చింది.

కాని ఈ ముస్తాబంతా మన్మథవిజయానికే నని అనేదెలా? నాలో స్క్వాడ్‌లీడర్ ఈ ప్రశ్నార్థకం గమనించేఉంటాడు.

"ఇంతేనా"

ఆ! స్క్వాడ్‌లీడర్ తలక్రిందులైనట్లు అదోలా అయి "మన సైనికులలో ఒకడు... మా ఉన్నాడే అతను... వారిని పసికట్టాడు. మొన్న సోమవారం పొలాల్లో కవాతు జరుగు తోంటే లీజిన్‌కి కడుపునొప్పి వచ్చింది. వెళ్ళి విశ్రాంతితీసుకో మన్నాను. అప్పుడే చేతిబాంబులు విసరటం తర్ఫీదు ప్రారం భించాం. మా ను వెళ్ళి కొయ్యబాంబులు ఇంటివద్దకి తీసుక రమ్మని పంపాను. అతను ఆవరణలో దక్షిణకొంపలోకి వెళ్ళే సరికి ఏమికనిపించిం దనుకున్నారు! లీజిన్ పడుకొని ఉంటే ఆపిల్ల ప్రక్కన కూర్చొని ఉంది. మా ని చూసి ఇద్దరూ టొమాటాల్లా ఎర్రబడ్డారంటే నమ్మండి. పాపం ఆ పిల్ల ఒక్క దూకున మెరుపులా గెంతిందట. లీజిన్ తెప్పరిల్లి "ఉలకావద్దు పలకావద్దని" చేతితో సైగలుచేశాట్ట."

స్క్వాడ్‌లీడర్ కొంచెం ఆగి గుక్కతిప్పుకొని చెప్పటం సాగించాడు.

"లీజిన్, మా, ఇద్దరూ దగ్గరి స్నేహితులు. మా "విజయను చేపట్టావా" అని ఏడిపించటం, లేదులే. ఈ విషయం అందరిదగ్గర దబ్బాకొట్టకు" అని లీజిన్ చెప్పటం పరిపాటి. మా ఎవరితోను చెప్పనని లీజిన్‌కు మాట ఇచ్చాడు. కాని నాకంతా రిపోర్టు చేశాడు.

"ఆ కుటుంబానికి ఈ విషయం తెలుసా" అని అడిగాను. దీనివల్ల రైతులకు ఎర్రసైనికులంటే తప్పు అభిప్రాయాలు కలుగుతాయేమోనని భయపడ్డాను. అప్పుడే విముక్తి చేయబడ్డ ప్రాంతం అది. ఇదివరదాకా గెరిల్లాప్రాంతంగా ఉండేది. వారికి కొత్తగా నిర్మించబడిన సైన్యంతో పరిచయంకూడా ఎక్కువగా లేదు.

"తెలుసని నేననుకోను. ఆ రోజు ఉదయమే ఆమె తండ్రి ఎరువులు వెయ్యటానికి పొలం వెళ్లాడు. ఆమె తల్లి లేస్తే కూచోలేదు. కూచుంటే లేవలేదు. జబ్బుమనిషి. అవతలింట్లో ఎప్పుడూ పడుకొని మూల్గుతోనే ఉంటుందిపాపం! పైగా ఆమెకు సగం చెవుడు కూడానూ. పోతే ఉన్న ఆ పన్నెండేళ్ళ కుర్రాడు మాతో కవాతులు చూడటానికి పొలాలకి వచ్చాడు."

"అయితే స్క్వాడ్‌లో మా ఒకడికే తెలుసా?"

"ఎలాగో అర్థంకావటంలేదు. కాని నిన్నసాయంత్రానికే అందరికీ తెలిసిపోయింది. నిన్నరాత్రి దీన్నిగూర్చి ఎన్నో నవ్వులాటలు జరిగాయి"

"అందరూ దీన్నిగూర్చి ఏమనుకొంటున్నారు? ఎలా భావిస్తున్నారు?"

"ప్రత్యేకించి ఏమీ అనుకోవడంలేదు. అందరికీ నమ్మకం ఉంది......లీజన్ ఆమె విషయంలో ఏమీ అపచారం చేయడని. అందం అన్నిటికన్నా ముఖ్యం అని...లీజన్ విషయంయిది నిజమేనని రుజువుచేస్తోంది. కాని ఇది స్క్వాడ్‌లో అతని ప్రతిపత్తిని, అధికారాన్నితక్కువచేస్తుందని భయపడుతున్నాను. ఎందుకంటే హాఁ, ఉన్నాడే...అతన్ని గురించి ఎంతోవుంది చెప్పాలంటే...అతనే నవ్వుతున్నాడు?"

"లీజన్ ఎలా ఉన్నాడు."

"అతనికికింకా జరుగుతున్నదేదీ తెలియదు. అతని పౌరుషం అందరికీ తెలుసుగదా ? అతనుండగా ఎవరూ ఏమీ అనరు. కాని మొన్న సోమవారం నుంచి అతనిలోనూ, ఆమె లోనూకూడా పెద్దమార్పు కనిపిస్తోంది."

అదెలాంటి మార్పో వివరించమని అడిగాను.

స్క్వాడ్‌లీడరు నవ్వుతూ "అంతే...ఇదివరకు కంటె మార్పు...అంతే...అదేమిటో మాటల్లో చెప్పలేను"

ఇంతే చెప్పాడు.

"అలాగా, స్క్వాడ్‌లీడరుగా ఆలోచించండి, ఈ విషయంలో ఏంచేస్తే బాగుంటుందో. మీ రతనితో మాట్లాడితే బాగుంటుందేమో ? అంతేగాకుండా..."

కొంచెం నెమ్మదిపడి స్థిమితంగా ఇలా చెప్పాడు. "మా స్క్వాడ్ ఉన్న ఇంట్లోకి కంపెనీ కార్యాలయాన్ని మార్చి, అక్కడికి స్క్వాడ్‌ని మారిస్తే ఎలా ఉంటుందంటారు"

నాకు తెలుసు, అతను దేన్ని గురించి ఆలోచిస్తున్నాడో. లీజిన్‌ని తనబిడ్డలా చూస్తాడు అతను. సాధారణ సైనికునినుంచి స్క్వాడ్ అసిస్టెంటులీడరుగా అంత చిన్నతనంలో పైకివచ్చిన లీజిన్‌యందే అతని సదభిప్రాయం, అభిమానం. లీజిన్‌ని శిక్షార్హుని చేయటం అతనికి మనస్కరించదు. పైగా కుర్రాడు సామాన్యుడా. పట్టినపట్టు విడచేఘటంకాదు. అతన్ని మార్చట మంత తేలికవిషయంకాదు.

"సరే. లీజిన్‌తో మాట్లాడిచూస్తా. యిల్లు మార్చే విషయం కెప్టెన్‌తో కూడా చర్చిస్తాను"

"ఇద్దరూ మామూలు రైతుబిడ్డలుగానే ఉంటేనా!... వారెటువంటి చక్కని దంపతులయేవారు"

స్క్వాడ్‌లీడరు నిట్టూర్పువిడిస్తూ వెళ్లాడు.

నేను లీజిన్‌ను కలుసుకొనేందుకు బయలుదేరాను. ఆ వారంఅంతా నాకు పనితోనే సరిపోయింది. క్రితం అయిదు నెలల్లో కమిసార్స్ ఇచ్చిన రాజకీయ శిక్షణ ఫలితాలను గూర్చి రిపోర్టులు వ్రాసుకోటమే అయింది. ఏ ఒక్కడితోనూ వ్యక్తిగతముగా మాట్లాడే తీరికే లేదు. రోజు వారీ క్లాసులకు అందరూ వచ్చి వరుసలలో నిలబడ్డారు. లీజిన్ చివరన ఉన్నాడు. నేనంత ప్రత్యేకించి చూడనూలేదు. కాని చివరకు నేనతన్ని సమీపించేసరికి, అతనిరంగురంగుల ముస్తాబుకు వళ్ళుమండింది.

మంచి గుడ్డతో కుట్టిన నీలిరంగు టోపీ పెట్టుకున్నాడు. బహుశా అది అతను స్వంతంగా ఎవరి మిషనుమీదో కుట్టుకొని ఉంటాడు. అతని కొత్త నీలిరంగు దుస్తులు మడతలు

నలగకుండా పరిశుభ్రంగా ఉన్నాయి. బెల్టులో తోటా లుండే చోట ఎర్రని రిబ్బను కట్టాడు. అందులోంచి తళతళ మెరిసే బాయనేట్ కొట్టొస్తున్నట్లుంది. జపానువారి నుంచి పట్టుకో బడ్డ మడతగుడ్డ కాళ్ళకు చక్కగా బిగించి చుట్టాడు. నీలిరంగు లేసులు కట్టిన తెల్లని గుడ్డబూట్లు వేశాడు. నేను దగ్గరకి వెళ్ళేసరికి అతని సెంటు గుమాయింపుతో తలదిమ్మెక్కింది. క్రితంసారి యుద్ధంలో జపానువాళ్ళ దగ్గర ఒక సైనికునికి ఒక మాంచి సెంటుసీసా దొరికిందట. బహుశా అది అరువు తీసుకొని ఉంటాడు.

నాకు నిజంగా కోపమొచ్చింది. నేను దేన్నైనా అస హ్యించుకొంటే... అది మగవారు ఆడవారిలా ముస్తాబవ టాన్నే.

నే పరీక్షిస్తున్నానేమోనని లీజిన్ సిగ్గుపడ్డాడు. రెప్పలు వాల్చి చూశాడు.

"ఇలా రా. నీతో మాట్లాడాలి"

అని అతనితో బయలుదేరాను. దగ్గరలో నేవున్న నది ఒడ్డుకు వెళ్ళి అక్కడొక పెద్ద చెట్టుక్రింద కూర్చున్నాం.

"ఇదంతా ఏమిటి ?"

అని ఒక్కసారే అడిగేశాను. కుర్రవెధవ అతి తెలివి తేటలు గలవాడు. అతనితో డొంకతిరుగుడున వృధాకాల క్షేపం అనవసరం.

అతని ముఖం కందగడ్డయింది ఒక్క క్షణం తలవం చాడు. గభాలున తలెత్తి "నాకు తెలుసు రహస్యం బయట

పడిందని. నిన్న నే అసిస్టెంటు ప్లటూను లీడరు కనిపించినప్పుడు
"తప్పుడోవన పడ్డావుగదూ ?" అన్నాడు. కమిసార్, నేనే
తప్పు చేయలేదు." అని గట్టిగా అన్నాడు లీజిన్.

"అయితే ఈ సెంటువాసన లేమిటి? ఈ రంగు రంగుల
ముస్తాబులేమిటి? అసలు ఈ వాలకం ఏమిటి?"

"నే నంగీకరిస్తున్నాను. నా దృక్పథం తప్పే" అని నెమ్మ
దిగా అన్నాడు లీజిన్.

"అసలు ఆమె విషయంలో ఊబిలో దిగబడ్డావా ?"

"లేదు. నేనే తప్పు చేయలేదు."

నేను తొంభై పాళ్ళు అతని నమ్మినా తిరిగి రెట్టించాను:

"ఫర్వాలేదు. నిజం నిర్భయంగా చెప్పు."

అతను చేతులు రెండూ చాచాడు.

"నిజంగా లేదు. కమిసార్ లేదు. నే నెప్పుడైనా మీతో
అబద్ధం చెప్పానా ? నే లేదని చెపితే, లేదన్నమాటే. అంతే."

"కడుపునెప్పి వచ్చిందని నీవు అబద్ధమాడినరోజు ఏం
జరిగిందో నిజం చెప్పు"

లీజిన్ కండ్లు మూసుకొని ఒకసారి పెదిమలు తడిచేసు
కున్నాడు ఆలోచనగా. చివరకు ఇలా ప్రారంభించాడు.

"నిజంగానే కడుపునెప్పి పెట్టింది, అంత ఎక్కువగా
కాకపోయినా. నే నింటికి వెళ్ళేసరికి ఆమె వస్తుందనీ ఏదో
మాట్లాడుకొంటామనీ సహజంగానే ఆశించాను. అక్కడపడు

కాని ఆమెతో ఎలా మాట్లాడాలా అని ఆలోచిస్తున్నాను. ఇంతలోనే ఆమె వేడినీరు తీసుకవచ్చి నా మంచం దగ్గరనున్న చిన్న టేబులుమీద పెట్టి త్రాగమంది."

"ఆమె నీ దగ్గరగా కూచోలేదా?"

"లేదు. ముందర ఆమె కూచోలేదు. మీ కంపెనీలో డాక్టరు లేడా, నీకు జబ్బుగావుంటే అతన్ని ఎందుకు పిలవవు అని అడిగింది. నే చెప్పాలనుకొన్నాను... నా కడుపునొప్పి అబద్ధమనీ, నేను నిన్నుగూర్చే ఆలోచిస్తున్నాననీ,...కాని ఎలా చెప్పేది. మాటలు దొరకందే. నే నదోలా |అయాను. ఎందుకో నాకే తెలియదు. చివరకు, నెప్పి పెద్దగాలేదన్నీ, కొంచెం విశ్రాంతి చాలనీ చెప్పాను. నాకు జలుబుచేసిం దేమోనని ఆమె భయపడింది. వేడినీరు నా కివ్వబోయింది. నే నింతలోనే ఆమె చేతిలోంచి గభాలున లాక్కొన్నా నేమో ఆ నీరంతా ఒలికి టేబిల్ తడిసింది......"

నాకు ఒక్కసారిగా ఆశ్చర్యమేసింది. ఆమె గూఢచారి కాదుగదా అని.

"ఆమె ఇంకా కొంచెం నీళ్ళు తీసుకరావటానికి వెళ్లా లనుకొంది. కాని నేనే ఆమెను ఆపాను. నెప్పి తగ్గిందన్నాను. కొంచెంసేపు వుండి మాట్లాడమని కోరాను. టేబుల్ను తుడిచిం తర్వాత ఆమె కూర్చుంది. మేమిద్దరం ఎంతగా భావపరంపరలలో మునిగామంటే ఇద్దరం ఏమీ మాట్లాడాలో తెలియలేదు. ఆమె కెంత వయస్సనీ, ఆమె కుటుంబం ఎలా జీవిస్తోందనీ అడిగాను మా కుటుంబాన్ని

3/1

గూర్చి ఆమె అడిగింది. ఆమెకు ఇంటివద్ద ఉండటం ఇష్టం లేదని, ఇతరత్రా ఎక్కడఉన్నా తనకి బాగుంటుందనీ చెప్పింది. మనం చాలా దూరం ప్రయాణంచేశామా? మనం ఎప్పుడూ జయిస్తోంటామా? సైనికుడు చెడ్డగా అయితే అతని తల నరికేస్తారా? అని ఆమె అడిగింది. ఆమెకు మనలో స్త్రీసైనికు లున్నారా? ఉంటే వారేమి పనులు చేస్తారో తెలుసుకోవాలని ఉంది."

"అయితే మన యూనిట్ నంబరుగాని, మన కెంతమంది మనుష్యులున్నారనిగాని, మన ఆయుధాలను గురించి, మందు గుండునుగూర్చి ఏమైనా అడిగిందా?"

"లేదు."

"తర్వాత"

"అప్పుడే వచ్చాడు. వెధవ మా."

అతను చెప్పేదంతా నిజమేనా అని ఆలోచనలో పడ్డాను నేను.

మా నన్నుగురించి రిపోర్టుచేశాడా అని అడిగాడు. నేను అవునన్నట్లుగా తల ఊపాను.

"చేస్తాడని నాకు తెలుసు. పచ్చివెధవ. వాడు కమ్యూనిస్టు."

"పాపం నువులాదల్లేవుందే! కామ్రేడ్" అని నేను ఎదురుప్రశ్న వేసి ఆమె విషయంలో అతని ప్రవర్తనమీద ప్రజలకీ మనకీ ఉండే సన్నిహితసంబంధాలు ఎంతగా ఆధారపడి ఉంటాయో చెప్పాను. పార్టీ, సైనిక శిక్షణదృష్ట్యా అది ఎంత తప్పో, అది ఎంతగా నిషేధించబడిందో అతనికి వివరించాను.

"కాని. నేనామెకు ఏ అవమానమూ చేయలేదు. నిజంగానే ఆడపిల్లలతో చెరలాడి ప్రవర్తించటం తప్పే. కాని ప్రేమ విషయం మాట్లాడుకోవటం తప్పేలా అవుతుంది. సైనికుడైనంత మాత్రాన ప్రేమవిషయం మాట్లాడుకోవటం తప్పని మీరంటారని నే ననుకోను." అన్నాడు లీజిన్.

'ప్రేమమాటలు' నిజంగా అతనికి చాలా కొత్త. బహుశా ఇప్పుడే నేర్చుకొని ఉంటాడు.

"అయితే నీ బాంధవ్యం ఉట్టి ప్రేమమాటలేకాని..."

"అంతే... అంతే... నేనామెను కోరుతున్నాను. కాని నేనామెను చట్టబద్ధంగా పొందగోరుతున్నాను."

చిక్కాడు ఇంకేం, ఇతని దూరదృష్టి ఏమిటి? ప్రతి వ్యక్తికీ తీయని కలలుంటాయి శాంతి లభించిన తర్వాత ఇతనేం చేయదలుచుకున్నాడు, కొంతమంది ఇళ్ళకు వెళ్ళాలని బిడ్డల్ని ముద్దులాడాలని కోరుకుంటారు. కొందరు తమ ప్రదేశాలకు పోయి అక్కడి తోటల్లో పని పట్టాలని తహతహలాడితారు.

"నీవా, నాల్గో సైన్యానికి చెందిన వాడివి. ఆమెరైతు బిడ్డ! నీవామెను కోరటంలో అర్థం ఏమిటి? ఆ విషయంమర్చిపో."

లీజిన్ బుగ్గలు ఒకసారి ఉబికాయి. అన్నాడు: "పెద్ద అధికారులైన మీరంతా, ఈ సంవత్సరం హిట్లరు, మరుసటి సంవత్సరం టోజో, అని చెప్తున్నారు గదా."

"అయితే, ఇప్పుడే ఆమెతో ఏర్పాట్లు చేసుకొని, విజయం సాధించిన తర్వాత పెళ్ళిచేసుకుందామనా?"

"మీరు సరిగా గ్రహించారు. నేను సైన్యంలోనే ఉండాలంటే, శెలవు అడిగి ఆమెను మా గ్రామంతీసుకువస్తాను. లేకపోతే అక్కడే మిలిటరీ పోస్టులో ఉద్యోగం చేయవచ్చు. నా పొలాలు చూసుకొంటూనే, నేను సైనికునిగా పనిచేయగలను. ఆమె చెప్పింది: పనులన్నీ... నీళ్ళుతోడటం, పంట పండించటం... బట్టలు కుట్టటం... అన్నీ తాను చేయగలననీ. కాని దున్నటం మాత్రం చేతకాదట."

"ఆమెతో ఈ విషయాలన్నీ మాట్లాడావా?"

"లేదు. ఇప్పుడు మాట్లాడి ఏం ప్రయోజనం, చేయలేనప్పుడు. వచ్చే యుద్ధంలో గుండు కెదురైతే... ఏమో... ఆమెను అనవసరంగా మరింత వ్యధ పెట్టడం తప్ప."

నాకు తెలుసు అతనెందుకలా ఆలోచిస్తున్నాడో. క్రిందటేడు వేసవి ముందర మేం అతని గ్రామ పరిసరాల్లో ఉన్నాం. అప్పుడు వాళ్ళనాన్న వచ్చి సవతితల్లి చచ్చిపోయింది, శిస్తు తగ్గింపు చట్టం అమల్లోకి వచ్చింది, జీవితము బాగుంది, కనక సైనిక జీవితం వదలి ఇంటికి రమ్మనికోరాడు. కాని దానికి మేం అంగీకరించలా. అలాగే ప్రస్తుతం ఈ ప్రణయగాధ సంగతికూడా. ఇచ్చటి రైతులింకా భూస్వామ్య పిడికిలి నుంచి బయటపడలేదనీ, వారింకా పెళ్ళిళ్ళ విషయంలో స్వేచ్ఛా స్వాతంత్ర్యాలమీద నమ్మకం లేని ఛాందసులనీ వివరించాను. అతను అంగీకరించని మనువు ఆమెతండ్రి ఒప్పుకోడని నచ్చచెప్ప ప్రయత్నించాను. పైగా లీజన్ వివాహానికి సమ్మతిస్తే ప్రతిసైనికునికీ ఆ హక్కు ఉండాలనీ, అప్పుడు సైన్యం ఎలా ఉంటుందో ఊహించమనీ హెచ్చరించాను.

నేను మాట్లాడుతోంటే అతనిలో వైరుధ్యాలమధ్య పోరాటం జరుగుతోందని స్పష్టంగా కనపడింది. అతని నడవడిక, అతని సహచరుడితో అతని గౌరవస్థానాన్ని పాడు చేస్తోందని స్పష్టపరిచాను.

అతను అదాటుగా చూచాడు.

"ఓ-అయితే వారు నన్ను గమనించారన్నమాట" అని అన్నాడు.

"ఏం జరిగింది? ఏం చూచాడు" అని అడిగాను.

"క్రితంరాత్రి, హాల్తోను, ఇంకా ఇద్దరు మిత్రులతోను గార్డు డ్యూటీనుంచి వస్తున్నాను. నేను వారికంటె ముందు నడుస్తున్నాను ఆవరణ గేటుదగ్గర ఎర్మ్... అదే ఆమెపేరు. నా కోసం నిలబడివుంది. నేను తల ఊపి చేతితోకూడా సైగ చేశాను. వెనకాలవాళ్ళు ఏ క్షణంలోనైనా రావచ్చు. వెనక్కి తిరిగి చూచా. వాళ్ళు కనిపించలా. మంచిది అని ఆలోచించి, ఆమెను ఆమె గదిలోకి తొందరగా తోసేశాను. మరి వాళ్ళేలా చూశారో ఆ భగవంతునికే తెలియాలి"

"ఆమె నీతో ఏమైనా చెప్పిందా ?"

"లేదు. అసలు టైమేదీ"

"పోనీ నీకు తెలుసా, ఆమెనీతో ఏమి చెప్పాలనుకుందో ?

"నాకెలా తెలుస్తుంది... ఈ హాల్ గాడు తప్పకో నన్నల్లరి పెడతాడు. కాని ఏం జేస్తాం పెట్టనీ."

"అంటే సైనికశిక్షణ హద్దుమీరతావన్నమాట"

లీజిన్ క్షణం ఆలోచించాడు. చివరకన్నాడు. "నేను నిజంగా చెపుతున్నాను కమిసార్. నేను మీతో మాట్లాడుతోన్నంతసేపు, ఆమెను నా నుంచి దూరంగా ఉంచాలని నిర్ణయానికి వస్తాను. కాని ఏం లాభం. నే నింటికివెళ్ళి ఆమెను చూడగానే మనస్సు చలిస్తుంది. మీకు తెలియదు. రెండు రోజులుగా పాపం ఆమె నాకేసి ఎలా జాలిగా చూస్తోందో? ఆమె కళ్ళు నీలాలు రాలుస్తోన్నట్లు మెరుస్తున్నాయి. ఆమెతో ఆ యింట్లోనే ఉంటూ...అసంభవం. ఈ ఆలోచనే నన్ను తలక్రిందులు చేస్తోంది."

ఇక ఏంచెప్పాలి. ఆమె అతని హృదయాన్ని ఆవరించింది. విజయాన్ని పొందింది. ఇదేమంత సరి అయిన విధానంకాకపోయినా, ప్రస్తుతానికి ఇల్లుమార్చక తప్పదని నిర్ణయానికి వచ్చాను. అతన్ని అడిగాను.

"నాల్గోస్క్వాడ్‌కి వేరే ఇల్లుమారిస్తే ఎలా ఉంటుంది."

"చాలా బాగుంటుంది" అన్నాడు ఏమీ చెదరకుండానే.

నిర్ణయానికి త్వరగానే వస్తాడు, ఈ పెద్దకుర్రడు.

## II

కంపెనీ కాప్టెనుతోనూ, మొదటి లెఫ్టినెంట్తోనూ ఆలోచించాను. నాల్గో స్క్వాడ్ని ఇంకో ఇంట్లోకి మార్చాలని నిర్ణయం జరిగింది.

ఇది మే 1944 నాటిమాట. 'విల్లోకాజిల్'లో మా మకాం. మా సైన్యాలు, ఆ జిల్లామీది బలాన్ని బ్రద్దలు చేశాయి. సివిల్ పరిపాలన నెలకొల్పాల్సిన కామ్రేడ్స్ ఇంకా రాలేదు. శిస్తులు, వడ్డీలు తగ్గింపు ఇంకా అమలులోకి తేవాలనే ప్రయత్నాలు ఏమీ చేయలేదు. ఫక్తు సైనికతరిఫీదును మించి మా కార్యక్రమం ప్రజల్లోకి పోలేదు. మాకు పదిమైళ్ళ దూరంలోనే బలమైన శత్రుబలగాలున్నాయి. వారికిగూడ జాతులసమస్య ఎక్కువగా ఉంది. అందువల్లే లీజిన్ విషయంలో మా రిపోర్టుచేయటం జరిగింది.

“మొదట్లో నేనేమీ చెప్పదలచలేదు. కాని ఇద్దరూ ఒకే ఆవేశంతో కదులుతున్నారు. మేం ఒక స్క్వాడ్లో ఉంటేనేం. ఆమె ఒకవేళ గూఢచారి అయితే...”అని మా వాతో చెప్పాడు.

నిజానికి అటువంటిదానికి ఆస్కారంలేదని నాకు తెలుసు. గ్రామస్తులు బీదరైతులు. ఎక్కువ కౌలుభూములమీద ఆధార పడ్డవారు. చాలామంది వ్యవసాయకూలీలు, అటువంటి వారూనూ.భూస్వాములతోనూతోత్తులతోనూకలిసేవర్గంకాదు.

ఆ ఆదివారం ఉదయం అంతా మార్పిడితో తీరికలేదు. ఎర్మీ తండ్రి, సావ్, తనింట్లోకి అద్దెకివచ్చేది కాప్టెను, మొదటి లెఫ్టినెంట్, మెస్సింజరు, నేనూ అని తెలుసుకొని చాలా తబ్బిబ్బయ్యాడు. ఉత్తరవైపుదికాక దక్షిణ వైపున్న పూరికొంపను ఇవ్వమని అడిగాను నేను అతనిని. "ఉత్తరవైపుదే మంచి స్థితిలో ఉన్నా అందులో పొగబోయే ఏర్పాట్లు పాడ యాయి. అందుకని దక్షిణపుది అడిగాను. అతనూ అంగీక రించాడు. అతని పన్నెండేళ్ళ కుర్రాడు మా సామాను సర్దుకోటంలో చాలా ఉత్సాహంగా సంతోషంతో సాయం చేశాడు.

నేను సర్దుకుంటూండగానే భోజనానికి బిగుల్ ఊదారు. భోజనానికి పోతూ ఎర్మీ ఉత్తరాన గుమ్మంలో చూచాను. ఇప్పటివరకు నాకు ఆమె కనిపించనేలేదు. ఆమె మా ఇంటి పైకే దృష్టి నిలిపి చూస్తోంది. నేను బయటికి రాగానే తిరిగి లోనికి వెళ్ళిపోయింది.

ఈ మాటు ఆమెను నేను బాగా చూడగలిగాను. పెద్ద కళ్ళు, చక్కని పొడుగాటి జుత్తు, మంచి ఆరోగ్యంగా సున్ని తంగా ఉంది. కాని ఆడ ముఖంలో విచార రేఖలు కనిపిం చాయి. మనిషి దించుకుపోయి దిగులుగా ఉంది.

అలాంటి మనిషి ఎప్పటికీ గూఢచారి కానేరదు, అని నాలో నేనే అనుకొన్నాను.

తర్వాత ఆమె తండ్రితో ఒకసారి మాట్లాడాను. అతనికి నలభై అయిదు సంవత్సరాలు అనే సరికి ఆశ్చర్యపో యాను. పనిభారంతో క్రుంగి ఎంతోముసలివానిలా ఉన్నాడు. అతని దుస్తులన్నీ అతుకులబొంతలే.

సావ్, గ్రామంలో ధనికుడైన హావ్ దగ్గర అర ఎకరంభూమి కౌలుకుచేసుకుంటున్నాడు. ఇతరత్రా కూలికి పోయి, అదీఇదీ కలిపి కాలక్షేపం చేస్తున్నాడు. అతని కుటుంబ విషయాలు మాట్లాడటానికి అతను ఇచ్ఛగించలేదు. విముక్తి సైన్యం రావటంతోనే, శిస్తు తగ్గింపునుగూర్చి, భూపంప కాన్నిగూర్చి అనేక పుకార్లు బయలుదేరినాయి. అయినా సావ్ సాధారణంగా రైతుకుండే భయంతో, ఆ విషయాల్ని ఎవ్వడూ ఎత్తలేదు. మేం రావటమంటే, అతని యజమానికి కోపంవచ్చి, తర్వాతయినా ఏదోచేస్తాడని అతన నమ్మకం. అతన్నిసొంతం విముక్తిచేస్తున్నామని నమ్మటానికే అతనికి ధైర్యంలేదు.

సంస్కరణలు, పరిపాలనా యంత్రాంగం చూడాల్సిన బాధ్యతగల కామ్రేడ్స్ వేరే ఉన్నారు. వారు వస్తారు. నా బాధ్యత అల్లా ఈ ఊపిరి తీసుకోటానికివచ్చిన విశ్రాంతి సమ యంలో సైనికులకు మంచి తర్ఫీదు నియ్యటం. సంవత్స రాలనుంచి క్రమతర్ఫీదు నియ్యటానికి టైమ్ లేకపోయింది. ఇప్పుడు మా శక్తినంతా దానిపై కేంద్రీకరిస్తున్నాం.

ఆ పిల్ల విషయంలో, గూఢచారి కాదని నేను విశ్వసించాను. లీజిన్‌ను అతని సహచరులు రాజకీయంగా విమర్శించారు; చర్చలు జరిపారు. ఇక ఎర్మ్ విషయంలో ఏ సమస్యా లేదనుకున్నాను.

ఆమె తమ్ముడు, జూ, నేనూ స్నేహితులయ్యాం. అతను సరిగా అతని అక్కలా పోతపోసినట్లుంటాడు. మొదట్లో బిడియపడ్డా తర్వాత అలవాటయ్యాడు. ఒకరోజు నేను గదిలో పని చేసుకొంటున్నాను. గుమ్మంలోనుంచొని నవ్వుతూ "మీరేనా కమిసార్" అన్నాడు.

"అవును"

"మీరు బలే మంచివారు"

"నీకెలా తెలుసావిషయం" అని ఆశ్చర్యపోతూ అడిగాను.

తల ఒకవైపుకు ఆడిస్తూ "లీజిన్ అలానే చెప్పాడు" అన్నాడు.

ఇంకోసారి ఏంజరిగిందంటే నాకు పూర్వంలా కడుపు నొప్పి వచ్చి విశ్రాంతిగా పడుకున్నాను. ఇంతలోనే వచ్చాడు జూ. నెమ్మదిగా నా పక్కకొచ్చి నుంచొని "కమిసార్, మీ రింతలో ఇక్కడనుంచి వెళ్తారా లేదా?" అని అడిగాడు.

నాకు కోపంవచ్చింది. వాళ్ళనాన్న సావ్ మేం ఇక్కడ నుంచి వెళ్ళాలని కోరుకుంటున్నట్లు అనటం ఈ కుర్రాడు విని ఉంటాడు. "లేదు. మేం వెళ్ళటంలేదు. ఇక్కడే ఉంటున్నాం-ఉంటాం." అని గట్టిగా అరిచాను.

అతని ముఖంలో మార్పేమీ లేదు. ఎవరో అతనిని బో ప్రశ్న అడగమని పంపివుంటారు. అతను గదినుంచి వెళ్ళి ఈ తున్నాడు.

"హే ! మేము వెళ్తున్నాం. ఏరోజు వెళ్ళేదికూడా నాకు తెలుసు. అయినా నేను నీకు చెప్పను."

"నాకు చెప్పండి" అని బ్రతిమాలసాగాడు.

"చెపుతా, కాని నిన్నుఎవరు అడగమన్నారో చెపితే.."

"ముందు మీరు చెప్పండి. ఎప్పుడు వెళతారో, తర్వాత నేను చెబుతా ఎవరు అడగమన్నారో."

కుర్రాడైనా వీడు దయ్యపువెధవ. అయినా ఇంకో విధంగా కనుక్కుందామని "పోనీ చెప్పక్కర్లేదులే. నేనా మాత్రం కనుక్కోలేననుకొన్నావా ?"

"మీరెప్పటికీ కనుక్కోలేరు."

"ఓ ! తప్పకుండా కనుక్కుంటా."

"అబ్బే ! నాకు తెలియనే తెలియదు."

"నేను సరిగ్గా కనుక్కుంటే ?"

"మీరు సరిగ్గా తప్పు చెపితే ?"

టేబులు మీదనుంచి రూళ్ళకర్ర తీసెను. నేను సరిగా కనుక్కుంటే దానితో పది దెబ్బలు అతనికీ. కనుక్కోలేకపోతే పది దెబ్బలు నాకూ అని పందెం వేశాను. అతను రూళ్ళకర్ర కేసి, తన చిన్న చేతికేసి అదేపనిగా చూస్తున్నాడు. నేను వెంటనే మాటమార్చి,

"నేను నిన్ను కొట్టనులే. ఊరికే... తేలికగా... నీ చిన్న ముక్కుమీద పదిసార్లు ఇలా అంటాను, సరా."

దీంతో అతని ముఖం విప్పారింది. వెంటనే మాట అందుకొని "మీరు తప్పు చెబితే మీ... పెద్ద... ముక్కుమీద పది దెబ్బలు సరా" అన్నాడు.

"సరే, ఇప్పుడు చెప్పేదా ?"

"ఓ! చెప్పండి చూదాం!"

"ఆఁ. మీ నాన్న - అవునా ?"

జూ సంతోషంతో గంతులు వేస్తూ ముక్కుపై పది దెబ్బలు... రూళ్ళకర్ర దెబ్బలు... అరవటం మొదలెట్టాడు. నేను సొంతం ఓడినట్లుగా "మరి అయితే ఎవరమ్మా" అని బుజ్జగింపుగా అడిగాను.

సంతోషంతో తబ్బిబ్బయి ఉన్నాడేమో "మా అక్క ఎర్మీ. ఇంకా చెప్పిందీ. మిమ్మల్ని అడగమని......" సగములో మాట మింగేశాడు.

"ఏమని అడగమంది ?"

"లేదు లేదు. ఏమీ ... లేదు. దెబ్బలో" నా ముఖంఅతని దగ్గిర వంచాను. కాని ముక్కుమాత్రం చేతితో కప్పి, "ముందు చెప్పు. అప్పుడు దెబ్బలు" అన్నాను.

"ఆమె అడగమంది మీ సైనికులు పెళ్ళి చేసుకో వచ్చా అని... కాని తర్వాత అడగవద్దంది."

అతను సంతోషంగా తన పందెం పూర్తిచేసుకున్నాడు. మేం ఎప్పుడు వెళ్ళేది తెలియదనీ, పై అధికారులు ఆర్డరు

పంపితే వెళతామనీ, పెళ్ళి విషయం... ప్రస్తుతము ఆ మాటే తలపెట్టటానికి వీలులేదనీ, జపానును గెల్చినతర్వాత ఆ విషయం ఆలోచించ వచ్చనీ అప్పుడే చెప్పాను.

"మీరునిజంగా జపానువాళ్ళతోనూ తొత్తులతోనూ యుద్ధం చేస్తారా?" అని అడిగాడు.

"ఓ ! నిజంగా. మేమేగా వాళ్ళని బెజియోబ్రిడ్జిదగ్గర చావబాదింది...నీ వేమంటావు వాళ్ళు మంచివాళ్ళా, చెడ్డ వాళ్ళా!"

ఆ కుర్రాడు ముక్కొకసారి నలుపుకొని, తల అడ్డంగా ఆడిస్తూ "నేను వారిని ద్వేషిస్తాను." అని పళ్ళు కొరికాడు.

అతను వెళ్తూంటే అలానే చూశా. తర్వాత నా పని చేసుకున్నా.

ఆ రాత్రికి నా బాధ సాంతం తగ్గలేదు. మాగన్నుగా ఉంది. ఇంతలోనే ఉత్తరవైపున ఇంట్లో గందరగోళంతో సాంతం మెళుకువవచ్చి లేచాను. సావ్ తెగతిడుతూ కొడ్తున్నాడు. పాపం ఆ పిల్ల బయటికి ఏడ్వరాదన్నట్లు మూల్గుతోంది. నేను లేచి బయటికివచ్చాను. ఇంతలోనే సావ్ ఆవరణలోకి వచ్చి ఏడుపు ప్రారంభించాడు. బాధపడ్తున్న కుక్కలా మూల్గుతున్నాడు.

తండ్రీ కూతుళ్ళ ఏడుపులూ, జబ్బులోనున్నతల్లి మూల్గులూ, ఒకదాని తర్వాత ఒకటి ఠణగాణధ్వనిలా గింగిర్లెత్తిస్తున్నాయి. ఈ దారుణపరిస్థితికేవం జరిగిందబ్బా? ఆమెను

లీజిన్ అవమాన పర్చలేదుగదా? అలా ఎప్పటికీ జరగదు. వాడు నాతో ఎన్నడూ అబద్ధమాడడు. ఉదయం అన్ని విష యాలు తెలుసుకుందామని నిశ్చయం చేసుకున్నాను.

ఉదయం నేను లేచేసరికి సావ్, భూకామందు చేలో గోధుమ కోయటానికి వెళ్లాడు. అతనితో మాట్లాడే వీలే చిక్క-లేదు. రైతులకు సాయం చేయవలసింగా మాకు ఆర్డర్లు వచ్చాయి. మా కంపెనీ సావ్ పంటకోతలో సాయం చేయాలి.

భోజనంచేసి ఎర్నీ, జూ, మేమూ పొలంవెళ్లాం. ఎర్నీ సరికొత్తని నీలి ఆకాశపురంగు దుస్తులు వేసుకొంది గోధుమ పొలాలు బంగారుచ్ఛాయలలో కాంతులు వెదజల్లుతోంటే నీలిరంగుల ఎర్నీ మనోహరంగా ఉంది. కంటిలోని కొద్ది ఎర్రజీర మాత్రం రాత్రి జరిగినదానిని గుర్తుకు తెస్తోంది.

లీజిన్ దూరంగా వుండి పనిజేస్తున్నాడు. ఎర్నీ పంటచేలో పనిచేస్తోనే అతనివైపు దొంగచూపులు చూస్తోందనిపించింది నాకు. నేనే పొరపాటుపడ్డానేమో ?

సాయంత్రం అందరం కులాసాగా "దేశద్రోహుల వేట" ఆడుతున్నాం. లీజిన్ చాలా సంతోషంగా, ఉల్లాసంగా వున్నాడు. కాని ఆటలో ఏమాత్రం నేర్పుచూపలేక పోయాడు. తనలో తను పాడుకొంటూ కులాసాగా కనిపించాడు.

ఆ రోజే రాత్రిదాకా దానికారణం నాకు తెలియలే. రాత్రి ఒంటిగంటకు నేను అన్నీ సరిగ్గా ఉన్నాయో లేదో పరీక్షచేసి వచ్చి అపుడే పడుకున్నాను.

ఇంతలోనే, అయిదోస్క్వాడ్ అసిస్టెంట్‌లీడరు జెన్స్, లీజిన్ ఆ రొడ్డువెంట వస్తున్నారని వాళ్ళ పదధ్వనిని బట్టి గ్రహించాను. నేను కంపెనీలో చాలాకాలం ఉండటంవల్ల మనుష్యులను జూడకుండా, నడకవింటే ఎవరో చెప్పగల అల వాటు అయింది. చీకట్లో సెంట్రీకేకవేస్తే అతనెవరో నే పోల్చ గలను.

వాళ్ళు టైముచూడటానికి వచ్చారు. ఒక్కొక్క-స్క్వాడ్ రెండు కొవ్వొత్తులుకాలే టైము సెంట్రీగా పని చేయాలి. అదీ ఏర్పాటు. రెండోవత్తి అయిపోవచ్చింది. జెన్స్ త్వరగా తనవారిని లేపటానికి వెళ్ళాడు. లీజిన్ మెల్లగా దగ్గరికి వచ్చిచూచాడు. నేను నిద్రనటించాను. అతను తిరిగి గుమ్మందగ్గర ఒకసారి ఆగి దగ్గుతూ వెళ్ళిపోయాడు. ఈమాటు నిజంగానే నిద్రపోయాను.

అది వేసవిరాత్రి. ఆకు లల్లాడంలేదు. నాకు మెళుకువ వచ్చింది. వెచ్చగా ఆవిరిగావుంది ఆరుబయట షికారుపోదామని బయలుదేరాను. గుమ్మం దాటుతోనే వెనక్కు అడుగు వేశాను. ఆ ఆవరణలోనే మధ్యగా ఎర్మ్, లీజిన్ ఎదురు బదురుగా నిలబడి ఉన్నారు.

ముందుగా అనుకున్నా; వెంటనేవెళ్ళి ఇదేమిటి అని అడగాలని. కాని తర్వాత చూస్తే వారేమీ హద్దుమీరనట్లు గుర్తించా. పౌర్ణమినాటి వెన్నెల కాస్తోంది. ఆ వెన్నెట్లో అంతాస్పష్టంగా కనిపిస్తోంది. లీజిన్ మొఖం కోపంతో ఎర్రబా రింది. వారిద్దరూ ఏదోమాట్లాడుతున్నారు. కాని నాకుబాగా

ఇరవై అయిదు గజాలదూరంలో ఉన్నారేమో, ఏమీ విని పించటంలేదు. ఎర్నీ ఏడుస్తోంది; ఆమెను ఊరడించాలని చేతులు ముందుకు చాస్తూనే వెనక్కు తీసుకున్నాడు లీజిన్. ఎర్నీ ఒక్కసారిగా అతని ఛాతీపై తుపాకికి కట్టిన తోలుబెల్టు పట్టుకొని అతని హృదయంలో తల దాచుకొంది. ఏం చేయాలో తెలియని అవస్థలో లీజిన్ కొయ్యబొమ్మలా అలానే నుంచున్నాడు.

వారితో మాట్లాడటం మంచిది అనుకొని, టోపి తెచ్చు కొందామని లోపలికి వెళ్ళివచ్చాను. ఇంతలోనే ఎర్నీ తిరిగి ఇంట్లోకి వెళ్ళుతోంది. నేను లీజిన్‌ని కలుసుకునేందుకు బయ టికి వెళ్ళాను.

# III

ప్రజలను అర్థం చేసుకొనేశక్తి నాలో ఎంత లోపించిందీ! వారి కనీస కష్టాన్ని గూర్చి అయినా తలంపేలేదే. ఆ విషయాలన్నీ నా కళ్ళముందరే ఉన్నా చూడలేని గ్రుడ్డివాణ్ణి అయిపోయానా? లీజిన్ , తనకీ ఎర్మీకి ఉన్న పరిస్థితులు చెప్పినప్పుడు నాలో నేనే సిగ్గుపడ్డాను. పెటీబూర్జువా మేధావినైనందుకు నన్ను నేనే నిందించుకున్నాను.

లోలోన కుములుతోన్నట్లుగా, అతను మాట్లాడుతోంటే అతని శరీరమంతా వణికింది. మనిషి ఏమీ పాలుబోనివానిలా పిచ్చివాడయ్యాడు. అతను చెప్పింది ఇదీ.

" ఏడేళ్ళక్రిందట ఎర్మీ పెద్ద అక్కని ఆ గ్రామంలోనే ఉన్న లిహ్ కిచ్చి వివాహం చేశారు. అతన్నే 'గెడ్డపాడు' అంటారు అంతా. గెడ్డపాడు భాతుగ్రుడ్లను షాంఘై, నాన్‌కింగ్‌లకు తీసుకపోయి వ్యాపారం చేసేవాడు. సావ్ కంటె ధనికుడైనా ఎర్మీ పెద్ద అక్క సౌందర్యం చూసి ఆమెను పెళ్ళాడాడు. దూరదూర ప్రాంతాల తిరుగుడులో, కొత్తమై

కాలు అలవాటయి అప్పుల పాలయాడు అప్పటినుంచి అతనికి చెడ్డకీ మంచికీ భేదం తెలియదు: పాపానికీ పుణ్యానికీ భేదము లేదు. మురికిగుంటలోని నల్లరాయి అనేవారు ప్రజలు అతనిని. మూడేళ్ళలోనే ఎర్మ్ అక్క మరణించింది. జపానువాళ్ళు దేశ భక్తుల వేట ప్రారంభించారు. కుమిన్‌టాంగు నాయకుడు... హాన్ చిన్... తన సైన్యాలతో వారితొత్తు అయాడు. అప్పుడే ఈ గెడ్డపాడు వారిలో చేరాడు. చేయరాని పనులన్నీ చేసి కెప్టెన్ అయాడు.

ఈ వేసవిలో "తొత్తులు" ఇక్కడకు దగ్గరలోనే ఉన్న జియాన్గ్ బ్రిడ్జిదగ్గర బలాలు చేకూర్చుకున్నారు. నది కిరువైపులా తన సొంత రాజ్యంలా ఏలుతున్నాడు గెడ్డపాడు, అక్కడ కూర్చొని. వాడెప్పుడూ బీదలైన చుట్టాల్నిచూసిన పాపాన పోలేదు. కాని ఎర్మ్ అందమైనది అని తెలియగానే ఉన్నటుండి ఒకరోజున ఊడిపడ్డాడు, కొందరు వేటకుక్కలతో. కొంతకాలంగా నల్లమందు నిషా ఎక్కువై వాళ్ళంతా పుళ్ళు పుళ్ళుగావుంది. ఆకుపచ్చపసుపు ముద్దలావున్నాడు. సావ్‌తో తాను ఇంతవరకు తిరిగి వివాహం చేసుకోలేదనీ, ఇప్పుడు ఎర్మ్‌ని చేసుకుంటాననీ చెప్పాడు. కాని పాపం సావ్ దానికి అంగీకరించలేదు. దాంతో గెడ్డపాడి మొఖం నల్లబడి పెళ్ళి పెద్దని పంపుతున్నాను, నీ సమాధానమేమిటో చూస్తానని బెదిరిస్తూ వెళ్ళిపోయాడు.

మన సైన్యాలు ఇక్కడికి రావటానికి రెండురోజులు ముందు హావ్ వీరింటికివచ్చాడు. హావ్ ఈ గ్రామంలోని పెద్ద

జలగ, భూస్వామి, అప్పులిచ్చేవాడు అతగాడే. పెళ్ళి కంగీక రించకపోతే ఏమవుతుందో తెలుసా ? కెప్టెన్‌ను వ్యతిరేకించ గలరూ ? అలా జరిగితే ఆ రాక్షసి ఊరుకుంటాడా ? వాడి అధికారంలో మనం బ్రతుకుతున్నాం జాగ్రత్త" అని చేతి కర్రను ఝళిపిస్తూ బెదిరించేసరికి సావ్ ఇక తప్పదురా అని పెళ్ళికి అంగీకరించాడు. ముహూర్తంకూడా పెట్టుకున్నారు. కాని ఇంతలోనే మనం వచ్చాం. హావ్ ఇక్కడినుంచి పారి పోయాడు.

మనం ఇచ్చటినుంచి వెళ్ళిపోగానే ఆ గెడ్డపాడు తన్ని బలత్కారంగా సాధిస్తాడని ఎర్మి భయపడుతోంది. మనతో కలిసుండాలని ఆమె కోరుతోంది. అదే ఆమె తండ్రితో చెబితే అతను ఆమెను చితగగొట్టాడు. అందుకే గార్డు డ్యూటీ అయిం తర్వాత కలుసుకుంటే మాట్లాడాలని ఎర్మి నాతో చెప్పింది. ఇందువల్లే ఆమె మనతో రావాలని కోరుతోంది."

లీజిన్ కథముగించేసరికి నేను శిలాప్రతిమలా అయాను. "కమిసార్! ఆమెను మనతో రానివ్వండి." అని ఆవేశముగా అదేపనిగా అతను కోరుతున్నాడు. ఆ ఆవేశానికి కొరడా దెబ్బతిన్నట్లు చలించి తిరిగి ఈ ప్రపంచంలో పడ్డాను. మాట్లా డుతూ అతను అటు నిటూ నది వొడ్డున తిరుగు తున్నాడు. నేనక్కడే కూచుని ఉన్నాను. చల్లని వెన్నెలలో నీటిలోని బుడగలు ముత్యపు చిప్పల్లా మెరుస్తున్నాయి.

"మనం ఆమెను వదిలి వెళ్ళితే, ఆమె - నదిలో మునగ బోతోంది." అన్నాడు లీజిన్.

నిజంగానే ఇది క్లిష్టతర సమస్య. నా మెదడు గింగురు లెత్తుతోంది. అయితే, ఒకటి మాత్రం నిజం... ఆమె రక్షణ జరిగితీరుతుంది... అయితే ఎలా...

ఆలోచించినకొద్దీ పెద్ద అఘాతంలో దిగుతున్నట్లుగా ఉంది. ఆమెను జేర్చుకోటానికి... చివరకు రెజిమెంటులో ఏ శాఖలోనైనా సరే... ఏమీ వీలులేదు. సైనిక శిక్షణ దాని కంగీకరించదు. పైగా దాన్ని మార్చటం నా చేతిలో ఉన్నపనికాదు. పై అధికారు లంగీకరిస్తారా ? పెట్టని కోటల్లా కష్టాలు కనపడుతున్నాయి. సావ్ అంగీకరించదు. దాంతో ఇచ్చటి రైతులంతా యుక్తవయస్సు వచ్చిన పిల్లను ఎత్తుకు పోయామని అనరూ ? ఇది కొత్తగా విముక్తి పొందిన గ్రామం. ఇంకా పురాతన ప్రభావం చెక్కు చెదరని ప్రాంతం. పైగా లీజిన్ ఆమెను ప్రేమిస్తున్నట్లు ఇచ్చటి వారందరికీ తెలుసు. దీంతో వారిలో మనమంటే వ్యతిరేకత కలగదా ? ఈ విష యంలో ఇలా ఎర్మీని తీసుకపోటానికి అంగీకరిస్తే భవిష్యత్తులో ఇతరులు కూడా ఇలాంటి సాహసాలుకు దిగితే! 'స్త్రీ శాఖ' ఒకటి తయారయి కూచోదా ? నాకేమీ తోచటంలేదు. ఇవన్నీ అంత పెద్ద విషయాలుగా నాకుమాత్రం గోచరించటం లేదు ... ఎర్మీ పరిస్థితుల్లో మాత్రం ... నా పై అధికారులు నాతో అంగికరిస్తారా ?

ఒక చిక్కుసమస్యను ఎదుర్కోవలసి వచ్చినప్పుడు అందులోని కష్టనష్టాలనుగూర్చి అది ఎదుర్కొనేవారితో ముందుగా మాట్లాడం నాకు అలవాటు. అలాగే వున్న విషయా లన్నిటినీ లీజిన్ కు వివరించాను.

"రైతులెవ్వరూ పల్లెత్తుమాటైనా అనరు." అంటూ లీజిన్ ప్రారంభించాడు. "ఈ గ్రామంలో గెడ్డపాడిని, భూస్వామి హావ్‌ను ద్వేషించని వారెవ్వరూలేరు. అందరూ ఎక్సీ విషయంలో ఎంతో వ్యథచెందుతున్నారు. మనం ఆమెను తీసుకెళితే అందరూ మనకు జేజేలు కొడ్తారు."

మూర్ఖా! మళ్ళీ నా శక్తిలోపం అగుపించింది. నేను రైతులప్రసక్తి తెచ్చాను. కాని వారి హృదయాలలో ఉన్నదేదో తెలుసుకోకుండా... వారి వర్గతత్వాన్ని గమనించకుండా ... ఎంతటి పొరబాటు! ఉన్నరైతులు, బీదరైతులు, వ్యవసాయ కూలీలు. ఎవరో హావ్ రకం తప్ప ఎవరు మనల్ని నిందిస్తారు?

లీజిన్ ఇదివరలో మా ప్రధానకార్యాలయంలో జరిగిన సంగతొకటి గుర్తుకుతెచ్చాడు. 'పశువుగా' అమ్ముడుపోకుండా ఉండటానికే ఆమె పారిపోయివచ్చింది. అప్పటికి ఆమెకి అక్షరం ముక్కరాదు. అయితేనేం, ఇప్పుడు ఆమె కార్యాలయంలో చదువుతూ, పని నేర్చుకొంటూ పనిచేయటంలే. నిజమే. రిపోర్టు చెప్తున్నవానిలా ఉద్రిక్తంగా మాట్లాడుతున్నాడు లీజిన్.

"నేనామెను వదులుకుంటాను" అతను ప్రతిజ్ఞ తీసుకుంటున్నాడు. "నా కంపెనీ సోదరులందరి ముందరా చెపుతాను. నేను తప్పేనని అంగీకరిస్తాను. ఆమెను సురక్షితంగా వెనక ప్రాంతానికి పంపండి హాస్పటల్లోనో, ఫ్యాక్టరీలోనో పనిచేసుకోనివ్వండి. ఆమె ఇష్టంవచ్చినవానిని వివాహం చేసుకోమనండి. ఆమెను 'తొత్తు'కు భార్యగామాత్రం వదలకండి. నే నామెను

రక్షించితీరాలి. నా కామ్రేడ్స్ అంతా నన్ను బలపరుస్తారని అనుకొంటాను."

నేను చకితుడనైనాను. నిర్ణయబద్ధుడైన అతను ఆ పండు వెన్నెలలో కంచువిగ్రహంలా, మహావీరునిలా నా ముందు నుంచున్నాడు.

ఆ రోజే నేను నేర్చుకొన్నాను...ప్రజలలా ఆలోచించటం, ఎక్స్మిని గురించి చింతించడం...ఆమె తండ్రిలా...అందరిలా... అందరిలో నేను ఒకడిని. ఇప్పు డర్థమవుతోంది. ఆ రాత్రి సావ్ అంతగా ఎందుకు దుఃఖించాడో నే నప్పు డతనిని అర్థం చేసుకోలేనందుకు సిగ్గుపడాలి.

నేను లేచాను. లీజిన్ వీపుతట్టుతూ "కామ్రేడ్ లీజిన్, నేనూ ఆమెను రక్షించాలనే కోరుతున్నాను. కాని ఆమెను రక్షించామనుకో, ఆమె కుటుంబం ఏంకావాలి ? ఆమె స్వతంత్రురాలవుతుంది నిజమే. నీకు తెలియులే గెడ్డపాడు ఎటువంటివాడో ? హావ్ సంగత మర్చావా ? వాళ్లు వారిని వదలుతారా ? సావ్ పొలం లాక్కుంటారు ... ఇల్లు తగలబెడతారు ... కుర్రాడైన జూను ముక్కలు ముక్కలుగా చేస్తారు."

లీజిన్ పిడికిలి బిగించాడు. నామట్టుకు నాకే క్రూరత్వానికి లోనవుతున్నది నేనేననిపించింది. భూస్వామ్య విధానపు కబంధ వ్యూహంలో నలుగుతూన్నట్లుంది.

"దీనికేదో త్రోవ ఉండాలి" అని లీజిన్ ఆక్రోషిస్తున్నాడు. అతని కళ్లు కంపిస్తున్నాయి.

కాని ఆ త్రోవవది? భూస్వామి హోవ్ అధికారాన్ని ధ్వసం చేయాలి. తమని తామే రక్షించుకొనేలా ప్రజల్ని సుశిక్షితులుగా తయారు చెయ్యాలి. ఇదంతా శిస్తు, వడ్డీల తగ్గింపు చట్టం అమలులోకి రాందే జరగదు. కాని ఇది జరిగే లోపలే మనం ఇక్కడనుంచి బయలుదేరతామేమో? పోతే ఇక నున్నదల్లా జియాన్గ్ బ్రిడ్జి దగ్గర శత్రువుని... గెడ్డపాడిని ...నాశనం చేయాలి.

"కమిసార్! పై అధికారుల నడగండి... దాడికి అనుజ్ఞ ఇమ్మనండి" అని లీజిన్ వాదన మొదలెట్టాడు. అతనిదీ సరిగ్గా నా ఆలోచనే.

కాని జియాన్గ్ బ్రిడ్జి పెద్ద శత్రుకూటమి. ప్రధానమార్గం పైన ఉంది. శత్రు బలగం అక్కడే వృద్ధి చేయబడింది. పైగా దగ్గరలో ఉన్న పట్టణం నుంచి జపాను సాయంవస్తుంది. రెండు మూడు గంటలలోనే జపానుసైన్యం దిగజాలిన దగ్గరలో ఉంది. దాడి చేయుటం, అందులోనూ ఒక బెటాలియన్ తో... మంచిదికాదు.

కాని నేను చెప్పకుండానే లీజిన్ దీన్ని గ్రహించాడు. "పై అధికారులతో మాట్లాడండి కమిసార్... అజ్ఞ ఇమ్మనండి... నేనేపనినైనా సరే చేస్తాను." అన్నాడు లీజిన్.

అప్పటికే కోడి కూసింది.

తర్వాత ఉదయం, నేను బెటాలియన్ ప్రధాన కార్యాలయానికి వెళ్లాను. విషయాన్నంతా వివరంగా మేజరుతోనూ, కమిసార్ తోనూ చెప్పాను. నేను మాట్లాడుతోంటే మేజరు

కో పోద్రిక్తుడై ప్రతిజ్ఞలుపట్టటం ప్రారంభించాడు. నేను ముగించే సరికి అతని కళ్ళు నిప్పులు గక్కుతున్నాయి.

"పచ్చిదొంగలు...మా కుటుంబంలోని ఒకామెను... నా దగ్గరబంధువే...ఇలాగే ఎత్తుకుపోయారు. వెధవముండా కొడుకులు......వాడి అంతు కనుక్కోవలసిందే" అన్నాడు మేజరు.

"ఆ గెడ్డపాడు హత్యకు పాల్పడతాడంటారా? కాక పోతే తన కూతురును మనకప్పగించమని సావ్‌ను ఒప్పించగల డేమో? సివిలు పరిపాలనాయత్నాలు ప్రారంభమయాయి. కామ్రేడ్స్ వచ్చారు. అందువల్ల పొలం విషయంలో సావ్ భయపడాల్సింది లేదు. కొంతమంది రైతులను కదిలించి చూడండి. వారి అభిప్రాయాలు గమనించండి. ఇదే మంచిది." అన్నాడు బెటాలియన్ కమిసార్.

నేను తిరిగి వచ్చి గ్రామంలో విచారించాను. ఫలితాలు చూసి నేనే విభ్రమ చెందాను. నేను మాట్లాడిన ప్రతి ఒక్కరూ గెడ్డపాడి అంతు కనుక్కోవాలనేవారే. నే నింటికి తిరిగి వచ్చేసరికి గుమ్మంలో సావ్ ఎదురైనాడు. నన్నుదొడ్లో గడ్డివామి దగ్గరకు తీసుకెళ్ళి "కమిసావ్, మిమ్మల్ని ప్రార్థిస్తాను. నా బిడ్డని తీసుకెళ్ళకండి. తీసుకెళ్ళకూడదు. అలా చేస్తే నా కుటుంబం అంతా మాడిపోతుంది. నేనిప్పుడే జియాన్గ్ బ్రిడ్జికి వెళ్ళి...... మీాగు నన్నుగురించి కాకపోయినా, కుర్రాడు జూనిని చూసైనా అలా చేయకండి" అన్నాడు.

"అయితే నిజంగానే నీవు ఆమెను వాడి కప్పగించ నిష్ట పడుతున్నావా ?" అని రెట్టించి మళ్ళీ మళ్ళీ అడిగాను.

సావ్ నేల కాళ్ళు రాస్తూ, అసహాయునిలా, దించుకు పోయి ఇంటిలోకి వెళ్ళిపోయాడు. జూ 'నేను వారిని ద్వేషిస్తాను' అని చెప్పినమాటలు నాకు గుర్తుకు వచ్చాయి.

కెప్టిన్‌కు, లెఫ్టినెంటుకు ఇదంతా చెప్పాను. మేమంతా అసహ్యించుకొన్నాం. ఇంతలో కమిసార్ వచ్చారు. ఆయనతో గూడా అంతా చెప్పాను. ఆయన నవ్వుతూ "నేను రెజిమెంటు మీటింగులో ఈ విషయాన్ని తెచ్చాను. పార్టీ రాజకీయ ప్రతినిధి వారి విషయంలో శ్రద్ధ తీసుకోబడుతుందని మాట ఇచ్చాడు" అన్నాడు కమిసార్. కుటుంబాన్నే ఇంకోచోటికి మారుస్తారా అని అడిగాను. "అక్కర్లేదు. ఆ జాగ్రత్తలన్నీ తీసుకోబడతాయి. మీరేమీ వ్యధపొందవద్దని చెప్పమన్నారు. మీరు ఆ గడ్డపాడిని గురించి రిపోర్టు తయారుచేసి రాజకీయ శాఖకు పంపండి" అన్నారు కమీసార్.

ఆ రాత్రే నాగోసాక్వడ్ మీటింగు జరిగింది. ముందుగా లీజిన్‌ని అంతా వేళాకోళం పట్టించారు చిలిపిదగ్గులు వినిపించాయి. ఇదివరలో లీజిన్‌కి 'సాక్వడ్ కమిసార్' అని పేరు పెట్టారు అతని వాగ్ధోరణినిబట్టి. కాని నేడు అతను చాలా ప్రశాంతంగా మాట్లాడాడు. అతని మాటలు వింటోంటే సహచరులలో చాలా మార్పువచ్చింది.

"నన్నుగూర్చి నేనే ఎంతో సిగ్గుపడుతున్నాను. యుద్ధం అయిపోతుంది. అలాంటిపిల్లని......ఎర్మిలాంటి పిల్లని......

పెళ్ళిచేసుకుంటే ఎంత బాగుంటుందోనని ఆలోచనలు చేశాను. నిన్న మనం పొలంలో ఉండగా, ఆవిడ వచ్చి, రాత్రి నా కాపలా పని అయింతర్వాత కలుసుకోమని చెప్పింది. నాకు కొన్ని చెడుతలంపులున్నాయి...... ప్రజలెంతగానో కష్టాల పాలయి ఉన్నారు. నేనో నా సుఖాం చూసుకుంటున్నాను. ఇంకా విప్లవం సాధించాల్సి ఉంటే నేనేమో రంగురంగుల మతాబూలా వెలగాలనుకున్నాను. నీళ్ళలో మునిగిపోతూ ప్రజలు సాయం కోరుతోంటే నేను నా పడవలో మొద్దులా కూచున్నాను...... నిజంగా చెడు ఉద్దేశ్యంతోనే రాత్రి నేనక్కడికి వెళ్ళాను. ఆమె చెప్పింది...... నా మొఖము మీద డజన్ల సార్లు కొట్టినా అంత బాధ ఉండదు... నేను మనిషిని కాదు - కుక్కను. నేను సైన్యంలో జేరేటప్పుడు ఏమని వ్రాశాను? 'చివరంటా కష్టజీవుల కొరకు పోరాడ తానని...' ఇప్పుడు నేనేమీ తేనెపలుకులు చెప్పదలచ లేదు. కాని కామ్రేడ్స్ మీరంతా ఇకనుంచి నన్ను గమనించండి. నేను కోరేదల్లా మన అధికారాలు ఆమెను రక్షించేందుకు మార్గం ఆలోచించమని. దానికి నా ప్రాణమే కావాలంటే నేను సంతోషంతో సిద్ధంగాఉన్నాను.

ఒక నిమిషంపాటు అంతా నిశ్శబ్దంగా ఉన్నారు. తర్వాత ప్రతిఒకరూ నన్నొకప్లాను చెప్పమని డిమాండు చేయుటం ప్రారంభించారు. ఇంతలో షావో లేచి "ప్లాను ఏమిటి, జియన్గ్ బ్రిడ్జిని వశపరచుకోవాల్సిందే" అని అరిచాడు. సహచరులంతా హర్షధ్వానాలు చేశారు. ఇంతలోనే లీజిన్ వైపు

తిరిగి "నేను నిన్న, ఎర్మీని చూసినప్పుడు అది అందరితో వాగాను. క్షమించు" అని అన్నాడు.

ఎలాగో సర్దుచేసుకొని అందరికీ వినిపించేలా చెప్పాను. "పై అధికారులు అన్ని జాగ్రత్తలూ తీసుకొన్నారు. గ్రుడ్డిగా తొందరపడకండి. మీరు శ్రద్ధగా కౌశల అలవర్చుకోండి. చైనాలో లక్షోది ఎర్మీలున్నారు. వారంతా మన రక్షణకు ఎదురుచూస్తున్నారు గుర్తుంచుకోండి"

మరునాటికే ఇది ఊరంతా ప్రాకింది. కంపెనీలో అంతా మెరుపులా మెరిసింది. చాలామందికి వారి వారి అనుభవాలను జ్ఞప్తికితెచ్చింది. వారు కడ్డబాధలను తలచుకొని మండి పోయారు. ప్రజాపోరాటాలను ఆర్గనైజు చేయుటకు కామ్రేడ్ లుంగ్ వచ్చేసరికి భూస్వామి హూ చేసిన దుండగాలు వీసమెత్తయినా మరవకుండా చిఠా తయారయింది. "ఉన్న ముప్పై ఆరురకాల దోపిడీలలోనూ హూ ముప్పై అయిదురకాల దోపిడీలు సాగించాడు" అని లెఖ్ఖలు తేల్చి "పై పెచ్చు, పంటలు పండని సంవత్సరం శిస్తులు మాఫీ అని తీయని కబుర్లు చెప్పి పండిన సంవత్సరం రావలసినదానికి వడ్డీతో సహా అని చెప్పి పండిన పంటనంతా వూడ్చుకెళ్ళేవాడు" అన్నాడు లుంగ్.

ప్రజలంతా లుంగ్‌కు సాయపడుతున్నారు. ఏదో కొంత మంది మాత్రం భయపడుతూనే ఉన్నారు. హవ్ పారిపోయే టప్పుడు "ఈ విప్లవ సైన్యాలు ఎండాకాలం వర్షంలా గభిల్లున వచ్చి పోతాయి. తర్వాత మీ పని పట్టిస్తాం. జాగ్రత్త" అని బెదరించిపోయాడు. దాంతోనే సావ్ లాంటివాళ్ళు ఇంకా వొణుకుతున్నారు.

కాని ఎక్సీ మాత్రం శాంతపడింది. వారం తిరిగేలోపలే సంతోషంగా పొలానికి పోయి పని చేసుకొంటోంది.

ఒకరోజు మధ్యాహ్నం, మా కంపెనీ కెప్టెన్‌ని, నన్నూ బెటాలియన్ ప్రధాన కార్యాలయానికి పిలిచారు. మరునాడే మేమున్న ఊరునుంచి తూర్పు దిక్కుగా ఇంకోచోటికి మారటానికి ఆజ్ఞ ఇవ్వబడింది. జియాన్గ్ బ్రిడ్జికి ఎగువగా తొమ్మిది మైళ్ళలో ఉంది మజ్‌వాన్గ్. ఇప్పటి మా క్యాంపుకు అయిదు మైళ్ళు నదిమీద వచ్చే ప్రయాణీకు లందరినీ చెక్ చేయాల్సిన బాధ్యతమ్మాది.

“రైతుల గుండెనిబ్బరం పడిపోకుండా చూడండి. వారికేమీ ఫర్వాలేదనీ, మేం వెళ్ళిపోవటం లేదనీ, కొద్దిదూరంలోనే ఉంటామనీ చెప్పండి” అని బెటాలియన్ కమిసార్ నాతో చెప్పారు.

నేను సావ్ కుటుంబాన్ని గూర్చి అడగాలనుకొంటున్నాను. ఇంతలో మా కెప్టెనే అడిగేశాడు.

మేజరు, బెటాలియన్ కమిసార్ కేసి తల ఆడిస్తూ “వీరితో చెబుదామా?” అన్నారు. నాకేసీ, మా కెప్టెన్ కేసీ చూస్తూ, మెల్లగా మేజరు ఇలా అన్నారు. “దీన్ని మీరెక్కడా పొక్కనివ్వ కూడదు. జాగ్రత్త. ఆ బాధ్యత మీది ...మనం జియాన్గ్ బ్రిడ్జిని పట్టుకోబోతున్నాం. రెజిమెంటు సంబంధీకులు కొంతకాలంగా ఆ పట్టణంలోనూ, పరిసరాల్లోనూ పని చేసున్నారు. జియాన్గ్‌నుంచి ఒకే రోడ్డు ఉంది. పిట్ట బయటికి వచ్చినా మనకు తెలుస్తుంది. మన అండర్

గ్రెండు ఆర్గనైజేషన్ చాలా చురుకుగా పని చేస్తోందక్కడ. మన మనుష్యులు అతి ముఖ్యమైన చోట ఉన్నారు. మన రెజిమెంటునే విజయం సాధించమని అజ్ఞలు వచ్చాయి. మీ కంపెనీని తూర్పుకు మార్చటం శత్రువును మోసపుచ్చటానికే... మీరు ఎక్కడా దీన్ని చెప్పకూడదు."

తిరిగి గ్రామానికి వచ్చేశాం. కంపెనీ అంతా ప్రయాణ సన్నాహంలో ఉంది. సావ్‌కు శెలవు చెప్పటానికి నేను వెళ్ళాను. బెటాలియన్ కమిసార్ చెప్పినట్లు ధైర్యం చెప్పాను కాని, చివరకు మనవాళ్ళు పశ్చిమాన-కూడా ఉన్నారు ఫర్వాలేదన్నాను. మేజరు చెప్పిందాట్లో నేను బయటకు జారనివ్వలేదే. కాని ఎర్మీ నదిలో దూకకుండా చేయగలిగినవి ఆ మాటలే.

మరునాడు సూర్యోదయం కాకముందే, తిండీ తిప్పలు ముగించుకొని, రైతుల దగ్గర నుంచి అరువు తెచ్చుకున్న సామానువవరిది వారికప్పజెప్పేం. మా చుట్టూ చేరిన రైతులకు ఆఖరివీడ్కోలు ఉపన్యాసం ఇచ్చాను. నేను ఎంతమందో రైతులను గుర్తు పట్టగలిగాను. కాని ఎర్మీ మాత్రం ఎచ్చటా కనిపించలా. మేం బయలుదేరాం. రైతులు తిరిగివచ్చి వారిఆతిథ్యము స్వీకరించాలని కోరారు. ఒకరికొకరం విడలేని బంధువులుగా కనిపించాం.

ఆకాశంలో చరాల్ను దూసుకుపోయే పారాబందులా, మాకంపెనీ క్రమ వరుసలో సాగిపోతోంది. వరుస ముందున్న కామ్రేడ్ పాడుతున్నాడు.

చిట్టచివర ఉన్న నాకు అంతా కనిపిస్తోనే ఉంది. నేను లీజన్ ని పరిశీలిస్తూనే ఉన్నాను... వెనుదిరిగి చూస్తాడేమో అని. అప్పుడే అరమైలు వచ్చాం. మాతో పాటు సాగనంప టానికి వచ్చిన రైతులు క్రమంగా దిగబడి పోయారు...... ఆగలేక చివరకు వెనుదిరిగి చూశాను. చిగురుటాకుల పచ్చని గుబురుల మధ్య నీలి దుస్తులు ధరించిన ఆమెను చూశాను. దూరానికి పిట్టలా అవుపించినా నేనామెను గుర్తు పట్టాను.



# IV

ఉదయాస్తమానం కవాతులతో పదిహేనురోజులు గడిచాయి. ఏ విషయం ఆలోచించటానికీ నిమిషంకూడా తీరిక లేదు. ఒకరోజు కామ్రేడ్ లుంగ్ జాబుయిచ్చి మనిషినిపంపాడు. ప్రస్తుతం ఆయన వేరేచోటికి పనిమీదవెళ్ళాడు. భూస్వామి హాన్ తిరిగి గ్రామానికి వచ్చాడు. అతగాడు తిరిగి ఏమైనా గొడవలు చేయచ్చు. కనుక జాగ్రత్త అని హెచ్చరించాడు. కొంతమంది యువకులను హాన్‌ను పసికట్టమని నియమించాడు. ఏదైనా జరిగితే వారు నాకు కబురుపంపుతారనీ వెంటనే సాయంచేయమనీ ఆ జాబులో కామ్రేడ్ లుంగ్ కోరాడు. చాలా సంతోషంతో చేస్తానని సమాధానం పంపాను. అంతటితోనే ఆ విషయం మరచిపోయాను. ఎందుకంటే ఇంకా గొడవలుచేసి మనతో ఇప్పుడే కుస్తీకి దిగటానికి హాన్‌కు గుండెలుండవని నా నమ్మకం. ఏవరూ పులినోటిలో తల దూర్చరుగదా ?

కొద్దిరోజుల్లోనే మంచివార్త వినిపించింది. కంపెనీ అధికారవర్గంవరకూ పాల్గొన్న అధికారుల మీటింగులో జియాన్గ్

బ్రిడ్జిమీద దాడినిగురించి అధికారప్రకటన జరిగింది. ఇంకో రెజిమెంటు అవసరసమయంలో సాయంగా తెప్పించబడింది. మా బెటాలియనే ముఖాముఖీ రంగంలో దిగుతుంది. మాదాడి రెండురోజుల్లోనే ప్రారంభమవుతుంది. ఈ మధ్యకాలంలో అన్నివిషయాలూ శ్రద్ధగా పరిశీలించబడినాయి

మరునటి ఉదయం, పాఠం జరుగుతుండగా, బయటేదో గందరగోళం వినిపించింది. ఇంతలోనే జూ పరుగెత్తుకుంటూ లోపలికి వచ్చాడు. గుక్కతిప్పుకుంటూ పరిగెత్తినట్లు ఆయాసపడుతూ "ఎక్మీ...ఎక్మీ" అని మాత్రం అనగలిగాడు. రొప్పుతున్నాడు ముచ్చెమటలు పోశాయి పాపం! "ఎక్మీని ఎత్తుకుపోతున్నారు. త్వరగా పదండి" అన్నాడు జూ.

రైఫిల్ ధరించిన సైనికుడు ఆ కుర్రవెధవ ఏడీ అంటూ లోపలికి వచ్చాడు. "నేను ఆపి అడుగుదామనుకుంటూండగానే తప్పించుకొని పారిపోయివచ్చాడు. ఏడీ" అన్నాడు, ఆ సైనికుడు.

అతన్ని తిరిగి అగని చౌకీకి వెళ్ళమని సైగచేశాను. కుర్రాణ్ణి "ఎవర్రా తీసుకెళుతోంది" అని అడిగాను.

"వాడే. ఆ భూస్వామి"

కెప్టెన్ సరిగ్గా చెప్పమని వాణ్ణి దగ్గరసా తీసుకొన్నాడు.

"హూవ్ ముగ్గురు మనుష్యులతో వచ్చాడు. నా తండ్రిని కొట్టి, అక్కను తీసుకపోయాడు." అన్నాడు జూ.

"ఆమెను ఎక్కడికి తీసుకెళ్ళారు."

"నాకు తెలియదు. నేను పరుగెత్తుకొచ్చేశా. లేక పోతే నన్నూ ఈడ్చుకు పోయేవారే"

ఇంకేవరు ఆమె కోకపోతే పాపం ఆ కుర్రాడు అలస టతో కూలిపోయేవాడే. అతని ముఖం తెల్లబారింది. అతనికి మంచు యిచ్చి చూడమని అప్ప చెప్పాను.

"వెళదాం, కమిసార్, పదండి కమిసార్" అని అనేక గొంతులు ఒకేసారి మారుమ్రోగాయి. నేను లీజిన్ ఉన్నా డేమోనని పరిశీలించాను. అక్కే అతనిజాడ లేదు. ఆలో చించటానికి వ్యవధిలేదు స్క్వాడ్‌లీడర్‌ని కొద్దిమందిని తీసుకో మని ఆజ్ఞాపించాను. నేనొస్తానన్నాడు హాలో. నీవ్రా, మూ, రండని స్క్వాడ్‌లీడరు వారితో బయలుదేరాడు.

"నేనూ వెళితే మంచిదేమో. ఇందులో రాజకీయ ప్రాముఖ్యతకూడా ఇమిడివుంది" అని కెప్టెన్‌తో అని, స్క్వాడ్ లీడరుతో నేనూ వస్తున్నానని చెప్పాను.

అప్పుడే తెప్పరిల్లిన జూ దగ్గరకెళ్ళి హావ్ దగ్గర తుపాకి ఉందా అని అడిగాను.

"ఆ - ఉంది. ఒకటే ఒకటి."

"జాగ్రత్త. వాళ్ళుఉచ్చులో తలదూర్చకండి" అని కెప్టెన్ వెనకాల కేకపెట్టాడు.

మేం ఎంతో త్వరగా పరుగెత్తుతోన్నా ప్రాకుతోన్నట్టని పించింది చెమటలు మొఖంమీదికి కారుతోంటే టోపీతీసి తుడుచుకోవలసి వచ్చింది. మేమ గ్రామం చేరేసరికి అగ్ని పర్వతం రగులుతోందా అనిపించింది.

మేం గ్రామం చేరేసరికి రైతులు మా కోసం ఎదురు చూస్తున్నారు. "త్వరపడండి కార్మేడ్స్. వాళ్ళు పడవ ఎక్కారు... కొంచెం మంచినీళ్ళు తీసుకోండి ...జియాన్ బ్రిడ్జికి పశ్చిమంగా వెళ్తున్నాయి రెండు పెద్దపడవలు...ఏటికి ఎదు రెళుతున్నారేమో అట్టేదూరం పోయి ఉండరు...మీకు తప్పకుండా అందుతారు."

అబ్బ! ముందుగానే వాళ్ళు పడవ ఎక్కారని తెలిస్తే మైలుదూరం పరుగెత్తటం తప్పేది. మాజ్‌వాన్‌నుంచి నది ఒడ్డుకే వెళ్ళేపని. ఆగి విశ్రాంతిగా నీళ్ళుత్రాగటానికి వ్యవధి లేదు. వెంటనే ఉరకలేస్తూ సాగాం.

పదినిమిషాల పరుగులో మైలుదూరం వచ్చి ఒడ్డు ఎక్కాం. పశ్చిమంగా రైఫిల్ కాల్పు వినిపించింది. తిరిగి మళ్ళీ అదే శబ్దం. మనస్కౌటులే నని అరిచాడు, హూ. మన స్కౌటుల దగ్గర రైఫిలు లేదు. వారిది తుపాకి అని జవా బిచ్చాడు, మా.

ఏమయితేనేం, మాకు ఒక మైలునుంచే ఆ ధ్వనులు వస్తున్నాయి. త్వరగా అని హెచ్చరించాను. త్వరలోనే ఎగు వున నదివొడ్డున కొంతమంది కనిపించారు దగ్గిరికి వెళ్ళినకొద్దీ, ఇద్దరు స్కౌటులు, కొద్దిమంది రైతులు, కామ్రేడ్ లన్గ్, ఇంకా రెజిమెంటు సంబంధించిన వ్యక్తి ఒకరూ కనిపించారు.

చివరాయనే మమ్మల్ని ముందుగా చూశాడు. "హేయ్... హేయ్... త్వరగా రండి ... ఈ ముసలి వెధవ గట్టి పిండం...త్వరగా రండి" అని కేకలెట్టాడు.

రెండు పడవలు ఒడ్డుకు లాగబడి ఉన్నాయి. ఒక దానిలో...అరే!... లీజిన్ ఉన్నాడు. ఎర్నీ కట్లు విప్పుతున్నాడు. ఆమె అతనిని ఆనుకొని, అతని భుజంమీదపడి ఏడుస్తోంది. ఇంకో పడవలో గుర్రం మొఖం హావ్, పొడుగాటి గానుచొక్కాయి వేసుకొని నుంచొని ఉన్నాడు. అతని వెనకాలే నుంచొని ఒక స్కాటు, ఒకచేత్తో అతని మెడపట్టుకొని, రెండో చేత్తో అతనిపై పిస్టలు గురిపెట్టాడు.

కట్లు పూర్తిగావిప్పి, ఆ తాళ్ళవైపు, ఎర్నీనోటిలోకి కుక్కబడ్డ ఆ గుడ్డముక్కలవైపు చూచాడు లీజిన్. తర్వాత ఆమెను ప్రక్కకు తప్పించి రైఫిల్ తీసుకొని మెల్లగా లేచాడు. లీజిన్ ముఖంలో రోషం తాండవిస్తోంది. అతనిప్పుడు ఎంతైనా చేయగలడు. ఏమైనా చేస్తాడు. హావ్ కేసి నిగిడిచూపులు చూస్తూ అతని పడవలోకి దూకబోతున్నాడు.

"ఏమీ చేయకు లీజిన్. శిక్షించే ప్రభుత్వముంది, మరువకు" అని గట్టిగా కేకవేశాను. నేను రెజిమెంటునుంచి వచ్చిన కాప్టెనును హావ్ దగ్గర ఉన్న పిస్టలు తీసుకున్నారా అని అడిగాను. అదివ్వమని హావ్‌ను ఆర్డరుచేశాను.

"అది నేను గోధుమపొలంలో విసిరేశాను. అది మీకు కావాలంటే పోయి మాడండి" అన్నాడు ఆజిత్తులమారి. కాని వాడన్నాడో లేదో ఇంతలోనే పడవవాడొకడు చుక్కాని అడుగున సందుగా లోగోనె లడుగునదాచిన తుపాకిని తీసుకవచ్చాడు.

కామ్రేడ్ లుంగ్, నేనూ ఆలోచించి నిర్ణయం చేశాం. ఖైదీలను నాల్గోస్క్వాడ్ సభ్యుల రక్షణలో ఒక పడవలో జిల్లా అధికారులవద్దకు పంపే ఏర్పాటుచేశాం. రెజిమెంటు ప్రధానకార్యాలయంకూడా అక్కడేవుంది కనక దాని సంబంధీకుడు కూడా వారితో వెళ్ళాడు. గ్రామంనుంచి వచ్చిన రైతులను మాతోపాటు పడవలో రమ్మని కోరాం. కాని మాకంటె ముందుగా జయవార్తను గ్రామంలో చెప్పాలని గట్టునపడి పొలాలకు అడ్డంగా వారు ఒక్క ఉరుకు ఉరికారు.

నదీవాలులో తూర్పుగా మేం మా పడవ సాగించాం. ఎర్మ్మ ఏమీ ఎబ్బెట్టులేకుండా మాట్లాడింది. ఆమెలో నాకేమీ 'ఫ్యూడల్' నాగరికలక్షణాలు కన్పించలా. ఆమె చెప్పిందానికి లీజిన్ చెప్పింది జోడిస్తే కథ అంతా అర్థమయింది.

కుర్రాడు జూ మా కార్యాలయంలో అడుగుపెట్టి ఎర్మ్మ అని కేకపెట్టగానే లీజిన్ గ్రామంవైపు ఉన్నశక్తినంతా ఉపయోగించి పరుగెత్తాడు. మైలు సాగగానే ఇద్దరు రైతులు కనిపించి హావ్ పడవలలో ఎర్మ్మని తీసుకపోతున్నా డని చెప్పారు. వారు ముగ్గురూ నది ఒడ్డునే పడవ కనిపించే వరకు పరుగెత్తారు. లీజిన్ రెండుసార్లు కాల్పులు జరిపి, పడవ నావమని ఆజ్ఞ ఇచ్చాడు. ఈ కాల్పుల శబ్దానికి ఎగువనుంచి ఒక స్క్వాటు వచ్చారు. దాంతో పడవల ఇరువైపులా కమ్ముకున్నారు. చివరకు పడవలు ఒడ్డుకు లాగబడ్డాయి. కాళ్ళు చేతులూ కట్టబడి ఎర్మ్మ ఒక పడవ అడుగు భాగంలో పడి ఉంది.

"నీ వొక్కడివే ఎందుకు వారిని వెంటాడావ్? వారితో ఒక ప్లటూనికి ప్లటూనే 'తొత్తులు' ఉన్నారనుకో? అప్పుడెలా ఆపగలిగేవాడివి! అసలు అనుజ్ఞ లేకుండా ఇలా చేయొచ్చా?" అని లీజిన్‌ని విమర్శించాను.

అతను చిన్నగా నవ్వాడు. అతని వళ్ళంతా పులకరించింది. ఆమె చిలిపిగా అతన్ని గిల్లినప్పుడు ఆమె ముఖము గులాబిలా సంతోషంతో ఉబికింది

మేం గ్రామం చేరాం. నేలఈనినట్లు నది ఒడ్డున ప్రజలు ఇసకేస్తే రాలకుండా, చప్పట్లు చరుస్తూ కేరింతలు కొడుతున్నారు. ఎర్మీ ఒడ్డుకు దిగటానికి హాల్ట్ చేయందిచ్చాడు.

"నీ తండ్రి కెలా ఉంది" నే నడిగాను.

"బాగానే ఉంది. ఇంటివద్ద విశ్రాంతి తీసుకుంటున్నాడు."

"ఆయనతో చెప్పు, భయపడవద్దని" అప్పుడే హావ్ మన్మల్ని గురించి రైతులకు చెప్పిన మాటలు జ్ఞాపకానికొచ్చాయి. "ఆయనతో తప్పకుండా చెప్పు... మన సైన్యం ప్రజలను రక్షిస్తుందని."

లీజిన్, నేను తిరుగు ప్రయాణానికి బయలుదేరాం. ఒడ్డునుంచి ప్రజలంతా జేజేలు కొట్టారు. జూ, ఎర్మీలు మావేపు ఎంతో ఆశగాచూశారు. ఆమె కళ్ళనిండా నీళ్ళు నిండి తల ప్రక్కకు తిప్పుకుంది. లీజిన్ ఆమె వైపే చూస్తున్నాడు... వారిద్దరి మధ్యా ప్రేమ పక్వదశకు వచ్చిందా! అనిపించింది నాకు.

మే, మజ్వాన్గ్ చేరేసరికి నడిపొద్దు దాటింది. ఒక పెద్ద చెట్టునీడలో, రైఫిల్ తుడిచి మెరుగు పెడుతూ ఒక సైనికుడు పాడుతున్నాడు.

పాట : "ఎదురుదెబ్బ తీస్తామంటూ ఏడకెట్లా కబురొచ్చింది
పట్టరాని ఉత్సాహంతో పెయ్యంతా పులకించింది
బందూకులు బాగాతుడిచి, సన్నీలను చకచకగతోమి
లగెత్తుతా లడాయిలోకి, ఉరుకుతా యుద్ధంలోకి
లగెత్తుతా లడాయిలోకి, ఉరుకుతా యుద్ధంలోకి
ఎదురుదెబ్బ తీస్తామంటూ ఏడకెట్లా కబురొచ్చింది"

మరునాడు సాయంత్రం అయిదుగంటలకు మా బెటాలియన్ ప్రయాణం సాగించింది.

ప్రతి పల్లె పల్లె దగ్గరా చిరునవ్వులతో దీవించారు. "రాక్షస ముండాకొడుకుల్ని ఒక్కణ్ణైనా వదలకండి, మీ వెనకే మేమూ ఉన్నాం. వారి ఆకాశపు ఆశల్ని నేలమట్టం చేద్దాం." అంటూ ప్రతిశబ్దం ఒత్తాసిస్తోంది మేం గ్రామంలోంచి క్రమశిక్షణతో కవాతులో నడుస్తుంటే, ఎక్స్మి, ఆమె తండ్రీకూడా, ఆహ్వానించారు. ఆతని మొఖంమీద నిజమైన నవ్వు నేడే చూడగలిగాను. ఉదయభానునిలా ఆమె ముఖం జేగురుకాంతుల్ని విరజిమ్ముతోంది.

ఆ రాత్రి సరిగ్గా పదిగంటలకు దాడి ప్రారంభించాం. రెండుగంటలు కూడా గడవకముందే చాలమటుకు శత్రుబలగాలు లొంగిపోయాయి. కొద్ది పెద్ద భవనాలను ఆధారం చేసుకొని యింకా శత్రువు పోరాటం సాగిస్తున్నాడు. అదే

పనిగా మెషీన్ గనుతో అగ్నివర్షం ఎడతెరపి లేకుండా కురి పిస్తున్నాడు.

మూడంతస్తుల మేడలోవుండి మమ్మల్ని నిలవరించాలని ఒక శత్రుమూక ప్రయత్నిస్తోంది. దాన్ని లొంగదీయాలని మా కంపెనీ లక్ష్యించింది. చేతిబాంబులతో మూడో అంతస్తు ధ్వంసంచేశాం. మారైఫిల్ బారుకు ఎరఅయి మొదటిఅంతస్తులో శత్రువు నిలవలేకపోయాడు రెండో అంతస్తునుంచి అదేపనిగా కాల్పులు జరుపుతున్నాడు శత్రువు మా మెషిన్‌గనుల దాడికి తల ఎత్తినట్టల్లా నేలరాలుతున్నాడు. అయినా ఆ ముష్కరులు లొంగటానికి సిద్ధపడలా!

తలుపులు బ్రద్దలుచేయడానికి మన సైనికుడొకడు ముందుకురికాడు. కాని తలుపులు ఇనపబద్దీలతో బిగించబడి రాతిబండలానిలబడివున్నాయి. పైగా మీదినుంచి అగ్నివర్షం కురుస్తోంది. అందువల్ల ఆ కామ్రేడ్ జాగ్రత్తగా పాకుకుంటూ వెనక్కువచ్చాడు గాయపడి. చేతిబాంబులు ఒక్కుమ్మడిగా వెనకవైపుగోడకు విసిరాం. కాని అవి ప్రయోజనం సాధించలా. కెప్టెన్ నిచ్చెనలు తెమ్మని పంపుతూ, గుళ్ళవర్షం కురిపించమని ఆజ్ఞయిచ్చాడు.

యుద్ధంలో కాలగతి అతివేగం. అప్పుడే చీకటితెరను చీల్చుకొని వెలుగులు పుంజాలు పుంజాలుగా వస్తున్నాయి. తెల్లవారుస్తోందని ఒక సైనికుడు అంతస్తులోంచి అరిచాడు. అయితే కోటలో పాగా వేశామన్నమాటే అని మన సైనికులు కేరింతలు కొట్టారు. అప్పుడే రెండో ప్లటూన్ దగ్గరలోనే

వున్న ఇంటో భవనాన్ని ఆక్రమించుకొని మాకు సాయింగా వచ్చింది. వారితోవచ్చిన లీజిన్ భవనంమీదకు అప్పుడే దూక బోయాడు. అంతలోనే నేనతన్ని ఆపి "నీవే మొదటిదెబ్బ తీద్దుగాని, నిచ్చెనలొచ్చేదాక ఆగు" అని చెప్పాను.

ఒక క్షణంలోనే నిచ్చెనలొచ్చాయి. లీజిన్ ఒకదానిని చేతపట్టుకొని పరుగెత్తాడు. కెప్టెన్ గరిజ్సూ, లీజిన్‌మీద శత్రువు దెబ్బతీయకుండా శత్రువుమీద గుళ్ళవర్షం కురిపిస్తున్నారు మన సైనికులు.

అతను నిచ్చెన గోడకువేసి, ఎక్కటం ప్రారంభించాడు. ఇంతలోనే శత్రువువిసిరిన చేతిబాంబు అతని కల్లంత దూరంలో పడింది. ఆ అదురుకు ముకుళించుకుపోయిన దేహాన్ని ఒకసారి సాచి, నిచ్చెన నెక్కుతున్నాడు అతను. నిచ్చెన రెండవ అంతస్తుకు బరాబరిగా ఉంది. పైనుంచి శత్రువు విసరే చేతి బాంబులు క్రిందపడి ప్రేలినా నిచ్చెన పైభాగంలోఉన్న లీజిన్ సురక్షితంగా అంతస్తుదాక వెళ్ళాడు. వెంటనే చేతి బాంబు అంతస్తులో గుభిల్లున ప్రేలింది. వెంటనే మరొకటి, దాని తర్వాత ఇంకోటి... చేతిబాంబుల వర్షానికి అంతస్తు ఆకాశంలోకి తునకలు తునకలుగా ఎగిరింది. ఇంతలోనె ఇంకో మూడు నిచ్చెనలతో మన సైనికులు పైకెగబ్రాకారు.

అతను హావ్‌ను పడవలలో పట్టుకున్నప్పుడు అతని సాహసం చూసి, ఆ రోజు ఎర్మీకొరకు అంతచేశాడనడం అతని కన్యాయం చేయటమే. అతనెప్పుడూ సాహసే. కాని పోరాటం అయిపోయిందా, మనిషి మెత్త బడి, వేళాకోళాలతో

కులాసాగా కాలక్షేపం చేస్తాడు. కాని ఈ మాటుమాత్రం దానికి విరుద్ధంగా జరిగింది. అతనొక ఖైదీని ప్రశ్నించాడు:

"నీ కెప్టెన్ పేరు ఏమిటి?"

"జాన్స్"

"వాడికి గెడ్డముందా?"

"లేదు. వాడిది కప్ప మొఖం."

"గెడ్డపాడు ఉండేదెక్కడ" అని నేనడిగాను.

"ఓ!! వాడా?" అంటూ, తూర్పున మనవారు పట్టుకున్న ఓ పెద్ద భవనాన్ని చూపించాడు.

"అందులోనే" అన్నాడు.

అప్పటికే బాగా తెల్లవారింది. పోరాటం అయిపోయింది. తొత్తులున్న ప్రతిచోటా ఆక్రమించబడింది. ఉత్తరాన ఒక పెద్ద భవనం పొగలు గ్రక్కుతూ మండుతోంది, నేను లీజన్‌తో ఖైదీ చూపిన భవనానికి వెళ్ళాను. దాన్ని ఏదో కంపెనీ ఆక్రమించి అక్కడున్న తొత్తులందరినీ ఖైదీలుచేసింది.

"నీ కెప్టెన్ పేరు గెడ్డపువాడేనా?" అని నేనొకణ్ణి అడిగాను.

"వాణ్ణి గురించి ఎందుకు తెలుసుకోవా లనుకుంటున్నారు. వాణ్ణి యమరాజు ఎప్పుడో అల్లుడిగా తీసుకపోతేనా?" అన్నాడొక ఖైదీ.

ఇంతలోనే ఇంకొక ఖైదీ ముందుకువచ్చి, శాల్యూట్ చేసి "సర్, నేనే గెడ్డపాణ్ణి చంపాను. వాడుమమ్మల్ని లొంగనియ్యక ... నే నతని దగ్గరకు తీసుకెళ్ళేదా?" అన్నాడు.

"సరే, వెళ్దాంపద." అన్నాను నేను.

ఏదోకంపెనీ కెప్టెన్ "ఏం తమ్ముడూ, ఏమిటీ తొందర ఇవాళ" అన్నాడు. కాని లీజిన్‌ను చూసి వెంటనే గ్రహించి "ఓహో! ఇదా కారణం" అంటూ లీజిన్ వీపుమీద చరస్తూ, "జాగ్రత్త...చచ్చిన పామునే..." అతను చివరకేమన్నాడో మేం వినిపించుకోనేలేదు. మేం ముందుకు నడిచాం. మెట్ల నిండా తొత్తులశవాలే. కాకీదుస్తులలో మెరిసేగుండీలతో ఒక శవం పడివుంది. అది తప్పకుండా ఒక పెద్ద ఉద్యోగిదే అయి వుంటుంది. ముఖమంతా నల్లటినెత్తురులో కరుడుగట్టింది. పళ్ళు అసహ్యాకరంగా చెదిరిపోయాయి.

తిరిగి వచ్చాం. ఇప్పుడే గ్రహించాడు లీజిన్, తనకాలు నొప్పి పెట్తోందని. కాలి పట్టాలు విప్పగానే దాని నిండా చేతి బాంబు ముక్కలున్నాయి. కాని లోపలికి రెండు ముక్కలే గుచ్చుకున్నాయి.

వాటిని బలవంతంగా పెరికి, ఆ పెద్ద భవనంవైపు విస రుతూ "తిరిగి నీవే తీసుకో" అని తుపుక్కున ఉమ్మాడు అతను. ఫస్టుఎయిడ్ పెట్టెలోని మందుతో అతనికి కట్టుకట్టాం.

గెడ్డపాడి చావును నేను కంపెనీలో చెప్పినపుడు అం దరూ జయజయ ధ్వానాలు చేశారు.

ఈ రోజు పది గంటలకే తిరిగి ప్రయాణం సాగించాం. లీజిన్‌కు పెళ్ళిచేసుకోవాలనే వాంఛను కలిగించిన ఆ గ్రామా నికి ఎంతో దూరంగా ఉంది ఈ మాటు మా మజిలీ.

నెలరోజుల తర్వాత, ఆ గ్రామంలో శిస్తుతగ్గింపు చట్టం జయప్రదంగా అమలులో పెట్టబడిందని వార్తాపత్రికల్లో చూశాను. భూస్వామి హావ్‌కు జైలుశిక్ష విధించబడిందనికూడ పడింది. ఈ వార్తను విన్నప్పుడు సైనికులలో ఉత్సాహం వర్ణనాతీతం. కాని లీజిన్‌లో ప్రత్యేకత ఏమీ కనిపించలా. ఆమెను విడిచి ఉండటం ఎలాగూ తప్పదని ఆ అనుభవానికి సిద్ధపడ్డాడని నేను ఊహించాను.

# V

నవయుములో ఒకరోజున రెజిమెంటు ప్రధానకార్యాలయంలో, కంపెనీ అధికారుల సభ జరిగింది. అందులోనే... ఆవార్త ... అద్భుతమైనవార్త ... తెలియజేయబడింది... యాన్గ్సీనదినిదాటి, దక్షిణకియాన్గ్సు రాష్ట్రాన్ని తుడిచిపెట్టూ చికియాన్గ్రాష్ట్రందాక పెద్ద ఎదురుముట్టడి జరపబోతున్నామనే ఆ వార్త నిజంగా ఒక అద్భుతమైనవార్త. కోమింగ్టాంగ్ నాయకుడు జంగ్కైషేక్. షుచుఆన్ కొండలలో ఒక బౌద్ధ దేవాలయంలో 'బిక్షువు'గా కాలం వెళ్ళబుచ్చటానికి వెళ్ళాడు. సముద్రతీరం వెంబడి ఇంకా విముక్తి కాకుండాఉన్న కొద్ది తీరప్రాంతాన్ని విముక్తి చేయాల్సిన బాధ్యత మామైవుంది.

సరిగా అప్పుడే లీజిన్లో ఏదోమార్పు కనిపించింది నాకు. పైకి కనిపించకుండా ఉండాలని ఎంత ప్రయత్నించినా, అతనిలో ఏదో గొప్పతపన కనిపిస్తూనేవుంది. ఒకసారి, మూడు సార్లు చెప్పినదే చెప్పినంతవరకు అతని ప్లటూన్ లీడరు ఏం చెప్తున్నాడో అతను అర్థంచేసుకోకలేక పోయాడు. ఒకరోజు

సాయంకాలం నాల్గో స్క్వాడ్ లీడరు నాదగ్గర కొచ్చాడు. అప్పటికే సైనికులంతా విశ్రమించి నిద్రిస్తున్నారు.

"లీజిన్ ఏదో చేసేలానే ఉన్నాడు. రెండు రోజులనుంచి నిట్టూర్చడం మినహా అతను చేసిన పనేం లేదు. ఏదో కాగితంపై గిలుకుతూ, మాటిమాటికీ వాటిని చింపేస్తున్నాడు. ఇప్పుడే... అందరూ నిద్రిస్తూంటే అతను ఆరుబయటకుపోయి చందమామ కేసి అదేపనిగా అదోలాగా చూస్తున్నాడు......ఇప్పుడే నే చూశాను. ఏమిటయ్యాఇది అంటే, రేపు గాలి ఎలా ఉంటుందా? అని చూస్తున్నానని చెప్పాడు. చూచారా ఆ సమాధానం. దూడ గడ్డికి కొబ్బరిచెట్టు ఎక్కాట్ట వెనకటికి... నే నప్పుడే దగ్గరకి వెళ్ళి అతన్ని పరిశీలించాను. అతని కనుకొలకులనిండా..." అత నేం చెవుతున్నాడో నాకు తెలుసు. లీజిన్ ని ఒక కంటకనిపెడుతూ ఉండమని చెప్పి పంపాను. కాని యాన్ సీ నది దాటుతున్నామనీ, తను ప్రేమించిన ఆ గ్రామానికి ఏంతో దూరానికి...,ఎన్నో వేలమైళ్ళదూరానికి... ... వెళ్తున్నామని లీజిన్ అంతగా బాధపడ్తూండవచ్చుని నేను నాల్గో స్క్వాడ్ లీడరుకు తెలియజెయ్యలేదు. ఎందుకంటే ఈ దాడివిషయం ప్లటూన్ లీడరుకంటె తక్కువహోదా వారికి తెలియుదని... తెలియకూడనిదనిన్నీ, కాని లీజిన్ కు ఈ విషయం తెలుసునని కన్పిస్తూనేవుంది. అతను చిన్నవయస్సులో రెజిమెంటు కార్యాలయంలో వార్తాహరునిగా పనిచేశాడు. ఇప్పటికీ కార్యాలయములో ఇతన్ని ఆదరించే స్నేహితులున్నారు. ఇతనికి తెలియకుండా ఎలా వుంటుంది. లీజిన్, ఎక్కని మర్చిపోయాడను కున్నాను. నాదే పొరపాటు, అతనింకా ఆమెను వివాహం

చేసుకోవాలనే అనుకుంటున్నాడు. ఇప్పటిదాకా, ఆ గ్రామా నికి మేం దూరంగావున్నా, చెట్టుచుట్టూ తిరిగేపక్షిలా ఆ గ్రామంచుట్టూ తిరుగుతున్నాం. ఇప్పుడో యాన్గ్సీదాటి... వేలకొలదీ మైళ్ళు, నదులూ కొండలూదాటి ... మళ్ళీ తిరిగి రావటానికి సంవత్సరాలేపట్టొచ్చు. ఎవరు చెప్పగలరు ఇంతలో ఎవరికేం జరగనుందో ? ఆ రోజే...ఆమెను భూస్వామి హావ్ నుంచి రక్షించిననాడే ...బహుశా వారిద్దరి కడపటిసమావేశం.

మరునాటి ఉదయం నేను, లీజిన్‌తో మాట్లాడాను. గడ్డివాము నానుకొని, ఒకరి సరసన ఒకరు కూచోని మేం మాట్లాడు కొంటోంటే, అతనెంతో చిక్కిపోయినట్టు కనిపించాడు. చాలా సేపటివరకు నా ప్రశ్నలకు సమాధానం చెప్పలా. చివరకు నవ్వుతూ "కమిసార్" అత నన్నాడు.

"మీరీ నాడు నాకు రాజకీయ పాఠం బోధించక్కరలా. నేను నిర్ణయానికి వచ్చేశాను. కాని ఇది చెప్పండి; మనిషి గౌరవనీయమైన సుఖం కోరుకుంటాడా, లేక స్వీయ ఘంతోషాన్ని కోరుకోవాలా? ఇది చెప్పండి చాలు."

"నీ వేమనుకొంటున్నావు."

"మన పెద్దలుచెప్పే సామెత ఒకటుంది. కుక్కలా మాంసం తినేకన్న, మనిషిలా గంజిత్రాగటం మేలని."

"ఏ విషయమైనా నిన్ను బాధపెట్తోందా ?" దీనికి సూటిగా సమాధానం ఇవ్వకుండా అత నెదురుప్రశ్న వేశాడు. "కమిసార్, మనమెక్కడికి వెళ్తున్నాం."

"వెళ్ళమా ? ఎక్కడికి ?"

లీజిన్ మందకొడిగా మందహాసం చేశాడు." నన్నో వెధవక్రింద కట్టకండి. రెజిమెంటు కార్యాలయంలో నాకూ "సలహాలిచ్చే" స్నేహితులున్నారు. ఈ మాటు ఆకాశపక్షిలా మన మెగరబోతున్నాం. అయినా మీరేమీ ఆతురతపడ కండి. నేనేమీ పారిపోవాలని ప్రయత్నం చేయను."

"అయితే అసలు పారిపోవటం అనే ఆలోచనొచ్చిందా?"

"ఆలోచనే కాదు......" తనలో తను మాట్లాడు కొంటున్నట్టుగా చాలా మెల్లగా అన్నాడు. అతని కళ్ళు చెమ్మగిలి నీటిపొరలు కప్పినట్లున్నాయి. నాకు కొద్దిగా కోపం వచ్చింది." అయితే నీవు నాతో చెప్పిన ప్రతిమాటా, ఆరోజున స్క్వాడ్‌సభలో చెప్పిన ప్రతి అక్షరం. ఆమె విషయం వదిలే స్తున్నానని - అబద్ధాలేనా? "లేదు లేదు అవి నిజమే" అతను తొందరగా సమాధానమిచ్చాడు. "నే నన్నీ అలాగే అను కున్నానుఅప్పుడు... నేను స్వార్ధజీవిననీ, ఆమెను కోరటానికి నా కెట్టి హక్కూ లేదనీ... కాని తర్వాత, నేను ఆమెను భూస్వామినుంచి రక్షించాను, చియాన్గ్‌బ్రిడ్జిదగ్గర యుద్ధం చేశాను, నే ననుకున్నాను, ఆమెను వివాహం చేసుకోమని అడగాలని, ఆమె తిరస్కరించదు కూడానూ. పోనీలెండి, అదంతా ఎందుకు..." నొసట చేతితో రుద్దుకుంటూ ఒకే పెద్దనిట్టూర్పుగా "నే నామెను నిజంగా చూడాలనుకొంటు న్నాను...ఎప్పుడూ ఆమెను గురించే కలలు కంటున్నాను... ఇకను బహుశా కలలోమాత్రమే చూడగలుగుతా నేమో?" కనుకొలకుల నీరు కళ్ళల్లోనే దాచాలనే ప్రయత్నంలో లీజిన్

తల పైకెత్తాడు. 'అమ్మా' అని నవ్వాడు. కాని నవ్వులో మూలిగిన అతని హృదయం కన్పించింది. బలవంతాన తెచ్చుకున్న నవ్వుతో "ఇక నెందుకులెండి క్షోభ. ఆమెనుగురించి ఎప్పుడూ పెదవి కదపను" అన్నాడు.

"కమిసార్ తిరిగి పదండి. నా గురించి ఏమీ చింతించకండి...మీరే అన్నారుగదూ - ఆమెలాంటివారు చైనాలో లక్షలాది ఉన్నారని?"

నే నతన్ని వదలలేను. సంవత్సరాలతరబడి గాలిలో, వానలో, ఎండలో, మంచుగడ్డలలో నెత్తురు దారలుపోస్తూ పోరాడాం. మండే ఇళ్ళల్లో, కూరుకుపోయే బురదల్లో ఇద్దరం చేయీచేయీ కలిపి పోరాడాం. నడుస్తూనే అలసటతో నిద్రించాం. ఎన్నో కష్టాలనుభవించాం. కాని లీజిన్ ఎప్పుడూ కన్నీటిచుక్కొకటీ రాల్చలేదు. కాని ఇప్పుడు శిఖరాగ్రమందున్నాడు. దాన్నికూడా అధిగమించగలడే?

సాదరణంగా నా చేయిపట్టుకొని "నన్ను నమ్మరా కమిసార్, రెండురాత్రుళ్ళూ, రెండుపగళ్ళూ నాతో నేనే మల్లయుద్ధంచేసినట్లు బాధపడ్డాను.ఆలోచించాను...ఆలోచించి ఆలోచించాను, తచ్చాడాను, వేసారాను. మా గురించి... మన స్క్వాడ్‌లీడరు గురించి......మా గురించి... ...ఇతర కామ్రేడ్స్‌ను గురించి... నేను వదులుకోలేను కమిసార్, నేను వదులుకోలేను." అతనావేశంగా చెప్పుకుపోతున్నాడు. "ఎర్మని గురించి ఆలోచిస్తే నేను వ్యధపడ్డా సహించగలను. నేను నిలవగలను. కాని నేను సైన్యంనుంచి పారిపోవాలని ఆలోచిస్తేనే...

పార్టీ తర్వాత నన్ను అంగీకరిస్తుందా? ఎందుకైనా పని కొస్తానా? నా సహచరులు నన్ను తిట్టరా? ఎందుకో వీటిని మాత్రం నేను సహించలేను కమిసార్, సహించలేను!"

నేనతన్ని నమ్మకుండా ఎలా ఉండగలను. తండ్రీ కొడుకుల్లా, ఇద్దరం కలిసి జీవించాం, కలిసి పోరాడం. అతనికి మలేరియావస్తే రాత్రిల్లా అతనిపక్కనే గడిపేవాణ్ణి. అతనొకసారి యుద్ధంలో బాగా గాయపడినప్పుడు అతన్ని బుజానేసుకొని నేనూ దెబ్బతిన్నా మెల్లిగా పాడుకొంటూ వచ్చానే? "నా ప్రతిజీవకణాన్ని విప్లవానికి ధారపోస్తున్నాను. లేకపోతే నీకూ, ప్రజలకు అగౌరవంచేసిన వాణ్ణవుతాను" అని లీజిన్ ప్రతినబూనాడు. అప్పుడే చెప్పాను "నేను నిన్ను నమ్ముతున్నాను" అని.

లీజిన్ ఇప్పటికి నెమ్మదిపడ్డాడు. ఆవేశం చాలావరకు తగ్గింది. "నాకు నేనే సత్ప్రవర్తనను గురించి వ్రాసుకొందామనుకొన్నాను. కాని కలం ఆడలా. గత కొద్దిరోజులనుంచి జబ్బువానిలా బాధపడ్తున్నాను. ఈ విప్లవసైన్యంలో పుట్టి పెరిగాను. ఇదే నా ఇల్లు, నా సహచరులే నా ప్రియమైన తోబుట్టువులు. వీరందరినీ వదలి చీకటి కోణంలా అజ్ఞాతంగా నేను బ్రతకలేను... అక్కడ ఎంత ఎనలేని వెండిబంగారాలున్నా. జీవితమంతా తలవొంచే పనిచేయలేను."

నేనతన్ని విమర్శించి విడమర్చి చెప్పాను. నే చెప్పేది సాంతం శాంతంగా విన్నాడు. రైఫిలు బుజాన తగిలించుకుంటూ "మీారేమీా నన్ను గురించి వ్యధపడకండి కమిసార్!

పార్టీ ఎక్కడికి పంపితే అక్కడికల్లా వెళ్తాను. సైన్యంలో జేరే టప్పుడు ఏం వ్రాశానో... 'కష్టజీవులకొరకు ఆఖరివరకూ యుద్ధంచేస్తాను'... అలాగే నిలబడగలను. విశ్వసించండి కమి సార్" అన్నాడు.

కొద్దిరోజుల తర్వాత మే మక్కడనుంచి మహాప్రస్థానం సాగించాం. మెల్లి మెల్లిగా శత్రువలయాన్ని తప్పుకుంటూ, తప్పుకుంటూ, ఆ మండుగాలుల కరకుతనాన్ని అనుభవిస్తూ యాన్గ్‌సీనదిని దాటాం. అది పందొమ్మిదివందల నలభైనాలుగు చలికాలం.

# VI

పందొమ్మిదివందల నలభై తొమ్మిది। వసంతకాలానికి తిరిగి, షాన్‌టుంగ్ రాష్ట్ర దక్షిణప్రాంతానికి వచ్చాం. తిరిగి యాన్గ్‌సీ దాటుతున్నాం... కాని ఈమారు నేర్పరులై, అధునికంగా అమర్చబడిన లక్షలాది జనాళి... టియాన్‌సిన్‌నుంచి నదిదాక నది కిరువైపులా 'గ్రాండ్ కెనాల్' రెండు హస్తాలపై తరంగాలుగా వెల్లువలై దక్షిణానికి ప్రవహిస్తోంది... ఆ మహాజనాళి.

ఒకరోజున అదృష్టవశాత్తు మా డివిజను ఎర్మీగ్రామానికి దగ్గరనుంచి ప్రయాణం సాగిస్తోంది. అది నడిపొద్దు. విశ్రాంతికి కొద్దిగంటలు ఆగాం. లీజిన్ ఇప్పుడు కెప్టెన్. నా కోసం వచ్చాడు.

"మీ సలహా కావాలి కమిసార్! ఇది ఐడియాలజీకి సంబంధించిన ప్రశ్న." అతన్ని కూర్చోమని ఆహ్వానించాను.

బహుశా దీన్ని తీసుకురావటమే తప్పేమో?...... కాని మీకు తెలుసుగదా? మనం పూర్వ చిరపరిచితస్థలానికి దగ్గరగా ఉన్నామని......?

"అవును. ఇంతలోనే అయిదేళ్ళు గడిచాయి. నే వెళ్ళి అందరూ ఎలాగున్నారో చూడాలనుకొంటున్నట్లున్నావు, బహుశా ?"

"అయినా, అంతేకాదు. నేను మీకు కొంచెం చెప్ప దలిచాను. క్రితంసంవత్సరం ఎర్మీ దగ్గరనుంచి జాబువచ్చింది... ఆమె కమ్యూనిస్టుపార్టీలో జేరి పనిచేస్తోంది...... నే నామెకు సమాధానం వ్రాశాను. కాని తిరిగి ఉత్తరప్రత్యుత్తరాలు లేవు. ఆమె చంపబడిందో ... ఎవరినైనా వివాహం చేసుకుందో... ఏమో... నే వెళ్ళి చూడాలనుకొంటున్నాను. పై అధికారులు మమ్మల్ని గురించి శ్రమించక్కర్లేదు... వెళ్ళి చూడాలనుకొంటున్నాను." "నవ్వుతూ తప్పుగాకపోతే, మీరు నాతోవస్తే సంతోషం...మీరు రాదలిస్తేనేసుమా ?" అన్నాడు. నేనింకా ఆలోచిస్తూండగానే డివిజినల్ రాజకీయోద్యోగి వచ్చారు. ఆయన అభిప్రాయమేమిటని అడిగాను. మేం యిదివరలో ఈ గ్రామంలో ఉన్నప్పుడు ఆయన మా బెటాలియన్ కమిసార్‌గా ఉండేవారు. నేను ఈ మధ్యనే జరిగినసంగతిని ప్రస్తావిస్తూంటే ఆయనచేతులు వెనకకు కట్టుకొని అటునిటు తిరుగుతూ చివర కిలా అన్నారు.

"మన సహచరులు వారిని వారే క్రమశిక్షాబద్ధులుగా ఉంచుకోగలరని మనం విశ్వసించాలి. నిప్పురవ్వకు భూఖండాన్ని బ్రద్దలుచేసే మందుగుండును అరచేతబట్టి వేలాదిమైళ్ళు తిరిగే మనవారు,...ఎంతో వర్గచైతన్యంకలవారు... వారినిగురించా... స్వంత విషయాలు ఆలోచించలేదని మనం అనుకోటమా ?

ఏం? విముక్తి సైన్యంలోనివారు పెళ్ళిచేసుకో కూడదా? భార్యా బిడ్డల దగ్గరికి ఇంటికి పోకూడదా? మనం మానవులం... కాదూ మనం? మనందరికీ తెలుసు. జంగ్-కై-షేక్ ముఠా దోపిడిగాళ్ళవల్లా, అమెరికన్ సామ్రాజ్యవాదులవల్లా, మన స్త్రీలు మలినం గాకుండా వుండాలని మనం పోరాడుతున్నా - భవిష్యత్తులో కార్మిక కర్షక జనావళి... మనతో సహా... నిజమైన వివాహ స్వాతంత్ర్యం అనుభవించాలని మనం పోరాడుతున్నాం. మనమిప్పుడు త్యాగం చేస్తున్నాం. ...చాలా గొప్ప త్యాగం, చాలాకాలం వరకూ, కాని అది చాల గౌరవప్రదమైన త్యాగం. విప్లవమింకా కొంతకాలం స్వీయసుఖాన్ని త్యజించాలని కోరితే... కోరుతోంది...... మనం, మన సహచరులూ, సంతోష పూర్వకంగా త్యాగంచేయగల చేస్తారు; అనుకుంటున్నాను. ఏమయినా..."ప్రతినిధి కళ్ళు చిలిపిగా మెరిశాయి... "ఆ అమ్మాయిని అతను చూసిరావటం విప్లవానికి ఏ మాత్రం నష్టం కలిగించదను కుంటాను." లీజిన్ వైపు తిరిగి "నీవు నీ స్వాధీనంలో ఉన్నంతవరకూ, ఎవరూ నిన్ను వ్యతిరేకించరను కుంటాను."

ఒక గంటైన తర్వాత నేను, లీజిన్ బయలుదేరాం. విజయోపేతులై తిరిగివచ్చిన సైనికులలో ఈ ప్రాంతీయులకు ప్రథమంగా కనిపించినది మేమే. మమ్మల్ని అందరూ సాదరంగా హర్షంతో ఆహ్వానించారు. ఎదురెండకు చేతులు అడ్డం పెట్టుకొని ఆనందబాష్పాలు రాలుస్తూ పండు ముదుసలులు చిరునవ్వుల్తో తొణికిసలాడారు. పిల్లలు మా వెనకాల తండోప

తండాలుగా నినాదాలిస్తూ అనుసరించారు. పల్లెపల్లెనా ఎర్ర జండాలు ఎగరేశారు.

మేం తోవలో ఒక పెద్ద పట్టణానికి వచ్చాం. అక్కడ పెద్ద విజయోత్సవం జరుగుతోంది. అందరూ, మన సైన్యం ఎప్పుడొస్తోందని ప్రశ్నించారు. మా ఇద్దరికీ మేమే సైన్యమంతా అయినట్లు-టీ, బిస్కట్లు, ఏమిటేమిటో యిస్తూ ఎంతగానో ఆహ్వానించారు. మేం త్వరత్వరగా నడక సాగించాం.

కొద్ది సేపటికే "అదిగో అక్కడే" అని లీజన్ చూపాడు. పంట పొలాలమధ్య పచ్చలపతకంమధ్య మాణిక్యంలా ఆ గ్రామం కనిపించింది. భూసామి హౌవ్ ఇంటిమీద ఎర్రజెండా ఎగురుతోంది. మమ్మల్ని ఆహ్వానించేదులకు, రైతులంతా ... మా పూర్వ చిరపరిచితులంతా ... ముందు నిలబడి ఉన్నారు.

ఉన్నట్లుండి, లీజన్ నాచేయి పట్టుకొని "ఆగండి... ఒక నిమిషం ఆలోచించ నివ్వండి..." అంటూంటే అతని చేతి వొణుకును నే నర్థం చేసుకొన్నాను. ఇంతలోనే "సరే... వెళ్దాం పదండి...కాని నన్నొంటరిగా వదలిపోకండి...ఆమె వారితో లేకపోతే ... దయయుంచి... నా కోసమైనా... ఆమెను గురించి అడుగుతారు గదూ?"

రైతులంతా మా చుట్టూచేరారు. వారిలో ఎర్మ్మ కనిపించలా. నే నడగాలనుకుంటూ ఉండగానే ఒక మధ్య వయస్కురాలు, మమ్మల్ని పరిశీలనగాచూసి "హేయ్!! ఇది

వరకు మీా రిక్కడున్నారుగదూ" అని పెద్దగా అడిగింది. నే నవునన్నట్లు తల ఊపాను. "అవునవును...నీవే ఆ కమిసార్... నిన్ను..." లీజిన్‌ను చూస్తూ "ఓహో! 'ఎర్మి'...ఎర్మిని చూడటానికి వచ్చావా?...అలాగే, మంచిది అలాగే..." అంటూ ఒక చిన్నపిల్లను పిలిచి వెళ్ళి నీ వదుచుకు(రాడొచ్చా డని, ఎర్మిని పిలుచుకురమ్మన్నది.

"అక్కర్లే, మేమే వెళ్తాం. ఆమె ఎక్కడుంది? మీా కవవసరశ్రమ ఎందుకు" అన్నాడు, తొందరగా లీజిన్, టర్కీ కోడిలా ఎ(రబడ్డవదనంతో. ఆ మధ్యవయస్కురాలు నవ్వుతూ "అదే మంచిదేమో. సరే ముందుకు సాగండి, జిల్లా కార్యా లయంలోనో, సహకారసంఘంలోనో ఉంటుంది. అక్కడ ఎర్రజెండా ఎగురుతోంది" అని చెప్పింది.

లీజిన్, నన్ను త్వరగా వారినుండి పడలాక్కొచ్చాడు. కొయ్యబ్రిడ్జి దాటగానే అతని శరీరమంతా పులకరించింది. ఎదురుగుండా ఎర్మివస్తోంది. చక్కగా సవరించబడిన జుట్టుతో, ఎర్రని ఎరుపైన దుస్తులు ధరించి తలవంచుకువస్తోంటే - అతని శరీరమంతా పులకరించింది. మేం దగ్గరపడగానే, తలఎత్తి మాకు సాదరంగా శాల్యూట్‌చేసింది. అప్పుడు నిశ్చేష్టురా లైంది. ఆమె ముఖం సంతోషతరంగాలతో వెల్లువికింది.

నిజానికి నోరు అసమానమైనది-ఎంతగానో మాట్లాడా లనుకున్నప్పుడు అది మన మాటవినదు; కళ్ళు దాని పని చేస్తాయి. ఎర్మి కళ్ళల్లో ఇంకా సిగ్గుదొంతరలు దొర్లుతున్నా భీరుత్వంమాత్రం లేదు. స్థాయి, విశ్వాసం కనిపిస్తున్నాయి.

చివరకు నేనే ముందర మాట్లాడాల్సి వచ్చింది. "ఆశ్చర్య పోయావు గదూ?"

"ఏమయినా తిరిగొచ్చారు. మా గ్రామం, ప్రతి ఒక్కరూ ఎంతో సుఖంగా ఉన్నాం......అయ్యో! మర చాను... మీరు అలసిపోయి ఉంటారు, మిమ్మల్ని నిలబెట్టి ఉంచా... రండి గ్రామంలోకి పోయి విశ్రమిద్దురు గాని."

"వ్యవధిలేదు. మేం త్వరగా వెళ్ళాలి. మన సైన్యం ఈ రోజే ఇటునుంచి వెళ్తుంది" అన్నాడు లీజిన్.

"నాకు తెలుసు... పోయి ఎక్కడ కూర్చుందాం?... ఆ పడవలో కూర్చుంటే... అది మా జిల్లా ప్రభుత్వానిది" అంది ఎర్కీ.

మేం అ చిన్న పడవలో ఎక్కాం. నేను గడకర్ర తీసు కున్నాను. కాని నేను ఈ పనిచేసి కొన్ని సంవత్సరాలైంది. నవ్వుతూ ఎర్కీ నా చేతిలోంచి గడకర్ర లాక్కుంది. అతి సులువుగా ఆమె దాని నుపయోగించింది. చేపలా సారబెడుతూ నదిమధ్య భాగానికి చేరింది పడవ.

"ఆ ప్రదేశం ఎలా ఉంది?" అంటూ ఎర్కీ అక్కడకు పడవను నడిపింది. అప్పుడే వసంతకాలపు చిరుమొగ్గలు వాస నలు వెదజల్లుతున్నాయి. ఎత్తయిన గట్టుకు దిగువగా ఉందేమో, మిగతా ప్రపంచానికి మేం ఒంటరులం.

బాతులు గుంపులు గుంపులుగా మా దగ్గర సాగిపోతూ మోదాన్ని కూరుస్తున్నాయి. అంతా ప్రశాంతంగా ఉంది. మాలో ఎవరూ ఉలక లేదు. చివరకు లీజిన్ :

"కామ్రేడ్ ఎర్మీ, నా జవాబు అందిందా" అని అడిగాడు.

"లేదు. అదెక్కడో పోయి ఉంటుంది. నేననుకున్నాను నీవు ఎక్కడో......మీా ఇద్దరూ చాలా చిక్కిపోయారే?"

"సరిగ్గా అయిదేళ్ళు. ఎంతో ప్రయాణం చేశాం. నీకు జ్ఞాపకముందా, మనం చివరిసారిగా కలుసుకోవటం. అప్పుడూ మనం పడవలోనే కలుసుకున్నాం."

"నీకు తెలుసా, తర్వాత నేనెలా జీవించానో, పడవ ల్లోనే...పడవల్లోనే అంటే నమ్ము. నిజంగా ఒకటీ రెండూ కాదు, మూాడు సంవత్సరాలు, నన్ను రక్షించింది పడవలే."

దానిని గురించి అంతా చెప్పమనీ, అది తెలుసుకునేం దుకే మేము అచ్చటికి వచ్చామనీ చెప్పాను.

ఆమె వెనకకు ఆనుకొని, కొద్దిగా తలఎత్తి మొదలు పెట్టింది:

"అదో పెద్దకథ. పందొమ్మిదివందల నలభైనాలుగులో మన ప్రధానసైన్యాలు ఇచ్చటినుంచి వెళ్ళినతర్వాత పరిస్థితు లన్నీ మారిపోయాయి. విషమించాయి కూడాను. భూస్వామి హాన్, వాడికొడుకు కొంతమంది ద్రోహులతో తిరిగివచ్చారు. అధికపన్నులు వసూలు చేయటమేనా! ఉన్నదంతా దోచు కున్నారు. పిల్లకారునంతనీ కొమింగ్‌టాంగ్ సైన్యంలో జేర మని బలవంతం చేశారు. ధాన్యం దోచుకోవడం, ఇళ్ళు తగ లెట్టటం వారి ముఖ్యకార్యక్రమం. వారొచ్చినప్పుడల్లా వాకి లూడ్చి కళ్ళాబు జల్లినట్లే నట్టిల్లు చేసేవారు. అప్పటికే నేను మహిళాసంఘంలో పనిచేస్తున్నాను. జిల్లా కార్యాలయంవారు

నేను గ్రామంలో ఉంటే, హాన్ నామీద పగదీర్చుకోటానికి ఎంతైనా చేసాడని, గెరిల్లాలుగా పనిచేస్తోన్న మహిళాదళంకు నన్ను పంపారు. ఆ కాలంలో మోటారుబోట్లలో కొమిం ట్యాంగ్ సైనికులు నదంత కాపలా కాస్తుండేవారు, ప్రతిరాత్రీ ఏదో ఒక గ్రామం తగలపెట్టబడేది. నేనొక చిన్నపడవలో నాచుకొండలమధ్య దాక్కున్నాను. ఎప్పుడూ దాక్కోవ టమే. అప్పుడు నాకు తెలుసు. మీరూ, మన సైన్యం, గాలి దుమారాల్లో కఠినశీతోష్ణస్థితిలో ప్రయాణం సాగిస్తున్నారని మేం, ఆడవాళ్ళం చేయగలిగినదంతా చేసేవాళ్ళం. పడవలలో సందేశాలు అందజేయడం, బ్రిడ్జీలు పడగొట్టడం, రోడ్లుపాడు చేయిడం...ఇలాంటివెన్నో చేసేవాళ్ళం. ఇక్కడి వారినంతా సంఘటితపరచి, సభలు జరిపేవాళ్ళం. చేతబల్లెం, బెల్టుకు చేతి బాంబులు ధరించే దాన్నికూడాను, రెండు సం॥రముల క్రితం మీరెక్కడ సెంట్రీలనుంచారో, సరిగ్గా అక్కడే ఆ చెట్టుక్రిందే నేను సెంట్రీగా నిలబడేదాన్ని."

"హాన్ మా తండ్రిదగ్గరకెళ్ళి నన్ను తిరిగి తీసుకొస్తే మా కుటుంబాన్ని రక్షిస్తానన్నాడు. కాని మాతండ్రి, చచ్చినా సరే గాని ఇంటికిరావద్దని మా తమ్ముని చేత కబురుపంపాడు. తర్వాత మాయిల్లు తగలెట్టారు. మా తల్లితండ్రులు మజ్ వాన్గకు పారిపోయారు. ఇప్పుడదే మా ఇల్లు. అక్కడే ప్రభు త్వము మాకు పొలం పుట్రాయిచ్చింది. మళ్ళీ సుఖమైన కుటుంబజీవనం గడుపుతున్నాం. కాని ఆ రోజుల్లో మాగ్రామం ఎంతో కష్టదశ ననుభవించింది. నేను నేనే ఎంతగానో...... శత్రువుకు తుపాకులున్నాయి. మాకూ ఉన్నాయి. వాటిని

గురించి మాకేం భయంలేదు. మా స్క్వాడ్ నాయకురాలు వ్యవధి దొరికినప్పుడల్లా నాకు అక్షరాలు నేర్పేది. అలా అలా చదువు సాగించాను. ఆమె మాకు వార్తాపత్రికలు చదివి విని పించేది. ఒకరోజు మీ యూనిట్‌ని గురించి చదివింది, అప్పుడు మీరు పాన్‌టున్గ్‌లో ఉన్నారు. శత్రుబలగాలన్నా మీ మీద విరుచుకుపడుతున్నాయి...కుంభవృష్టి...కొండలనుండి ఆకాశ గంగలు పరుగులెత్తుతున్నాయి...ఆకలితో, కాళ్ళు బొబ్బలెక్కి-తోళ్ళూడి రక్తం కారుచున్నా, ఆ బురద రోడ్లమ్మట ముందుకు సాగుతున్నారు మీరు. నీవు ఆకొండ నెక్కుతూవుంటే పడిన ఆ నెత్తుటి ఆనమాళ్ళు...నేనామె నడిగి ఆ రిపోర్టుపడ్డ కాగితం తీసుకున్నాను. అది ఎల్లప్పుడూ నాతోనే ఉంటుంది. అన్నిటి కంటే ఘోరమయినది క్రితం చలికాలం గ్రామాలనిండా కొమింగ్‌టాంగ్ సైనికులు జేరారు. నీటిపై పడవలలోనే మా ఉనికి. మంచుకురిసి, మా పడవలు మంచుగడ్డలో కూరుకు పోయాయి. కొయ్యబారిన రొట్టెతప్ప తినేందుకు ఏమీ లేదు. తడిసి ముద్దయిన వరిగడ్డిమీద పడవల అడుగుభాగంలో గరుడు గట్టి బరిలో అలాగే నిద్రించే వాళ్ళం. నీవు నన్ను పడవలో నుంచి రక్షించిన సంగతి జ్ఞాపకం చేసుకొనేదాన్ని. మీరు పాన్‌నున్గ్ కొండలలో పడుతున్న బాధలను గురించి తలపోసే దాన్ని. అయినా అన్నిటిని ఓర్చుకొని అంతిమ విజయానికి మీరెలా పోరాడుతున్నారో మననం చేసుకొనేదాన్ని. మీరు తప్ప తిరిగివస్తారని నా విశ్వాసం, పత్రికతీసి దాన్ని తిరిగి తిరిగి చదువుకునేదాన్ని. చీకటిలో అక్షరాలు కనిపించక

పోయినా నీ మూర్తే కనిపించేది. నే కోరుకొనేదాన్ని... నీవు గర్వించ దగిన..."

లీజిన్‌ని చూస్తూ ఆమె చిరునవ్వు నవ్వింది. ఆమె కళ్ళల్లో ఆనంద భాష్పాలు ఆణిముత్యాల్లా మెరుస్తున్నాయి. "తర్వాత అంతా బాగుపడింది. మన సైన్యం వలయంలో శత్రువును బిగించి ఉచ్చును దగ్గరసా నొక్కింది. భూస్వామి హావ్‌ను అరెస్టు చేశాం. నలభై ఎనిమిది చలికాలంలో మీరు నిర్ణయాత్మకమైన యుద్ధం చేసి ఉత్తర చైనా మైదానాలలో విజయం సాధించారు. దాంతోనే, మేం నిజంగా నిలవదొక్కు కున్నాం, నమ్మలేకుండా ఉన్నామంటే నమ్ము — నేడు మిమ్మల్ని బహిరంగంగా రోడ్డుమీదే ఆహ్వానిస్తున్నామంటే - "కన్నీళ్లు తుడుచుకొంటూ నవ్వుల్తో గాలిలో తేలిపోయింది.

"మరి మీరూ చెప్పండి మీ గురించి"

గట్టునుంచి నినాదాలు మారు మ్రోగుతున్నాయి. సూర్యాస్తమానం బంగారుఛాయలతో ఆకాశం మెరుస్తోంది. ఉత్తరాన్నుచి సైనికులంతా క్రమ వరుసలో వస్తుంటే ముందుగా అగ్రదళం నడుస్తోంది.

"మేం ఏం చెప్పగలం. మాకంటె మీరే ముందుకు పురోగమించారు. ఇన్నిసం||లూ మేం పోరాడుతున్నాం, జయిస్తున్నాం, ముందుకు సాగుతున్నాం, అంతే." అంటూ లీజిన్ కేసి తిరిగి నవ్వాడు.

నే నర్థం చేసుకున్నాను. "కామ్రేడ్ లీజిన్‌ని నన్ను పరిచయం చేయనివ్వు ఎర్మీ. మా ఆరో కంపెనీ కెప్టెన్,

పీపుల్సు హీరో సెకండ్ క్లాస్. ఉత్తరమైదనపు ఆయుద్ధంలో లీజిన్, అతని సహచరులూ, ఒక శత్రు రెజిమెంటుకు రెజిమెంటునే పట్టుకున్నారు. గుట్టలకొలదీ ఆయుధాలు స్వాధీనం చేసుకున్నారు. అయినా ఈ కామ్రేడ్ ఇదివరకు కంటె వినయ సంపన్నుడు. పతకం బహూకరింపబడిన నాటినుంచి అతనికి ధరించటానికి ధైర్యమే లేదు."

"ఛా...అదేమిటి. పోతుందేమోనని తప్పితే..."

"నే నది చూడవచ్చునా?" అడిగింది ఎర్మీ పసితనంగా.

నిశ్శబ్దంగా జోబులోంచి తీసి ఆమె చేతిలో పెట్టాడు. అరచేతిలో అలా ఉంచుకుని సూర్యరశ్మిలో దాన్ని ఆమె చూసి మురిసిపోయింది. ఇప్పటికీ మా సైన్యాలు దగ్గర వచ్చేస్తున్నాయి. ఎర్మీ తల ఎత్తి లీజిన్ మొఖంలోకి చూసింది. ఆమె కళ్ళలో తృప్తి, సంతోషం, గర్వం తాండవమాడుతున్నాయి.

నేను లేచి, చివరంటావచ్చి, గడకఱ్ఱ చేతబట్టాను. నది మధ్యకు వచ్చాం. అప్పటికే చమటలలో నా చొక్కా తడిసింది. ఆ పనిలో నన్నుచూస్తే ఎవరికైనా నవ్వు పుట్టచ్చు. కాని వారు నన్నుచూసి నవ్వలా - వారి సంభాషణలో వారున్నారు. నే విన్నాను - లీజిన్ దృఢ గాత్రంతో మృదువుగా చెప్పటం.

"విప్లవ ప్రతీఘాతమైన పని ఏదీ నేను చేయలేదు ఎర్మీ! నేనందుకు గర్విస్తున్నాను."

"నీవు అలా చెప్పనక్కరలేదు లీజిన్. నీ పతకమే చెప్తోంది. ఇక నీవు పెట్టుకుతీరాలి." అంటూ దానిని ధరింపజేసి అతన్ని మింగేటట్లుగా పరికించి చూసింది.

పానకంలో పుడకలా నేనున్నానని చాలా కించపడ్డాను. పెద్దపెద్ద విసురులతో పడవను వేగంగా నడిపాను. సైనికులంతా నవ చైనా నిర్మాతల్లారా ముందుకు మున్ముందుకే, అని గానం చేస్తూ వస్తున్నారు. సూర్యుడు నిప్పు బంతిలా ఆకాశపు టంచున వేలాడుతున్నాడు. ఆ విజేతలు చైనా ప్రజల జేజేలందుకుంటూ పిడుగుల్లా దక్షిణా పథాన పురోగమిస్తున్నారు.





## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA127B173 |
| పుస్తకం పేరు | సుడిగుండం |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 79 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 2 |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | Bannu |
| స్కాన్ చేసినది | Prathyusha |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |